# భగవద్గీత

(పద్యకావ్యము.)

వేముగంటి దత్తోజీ పండిత ప్రణీతము.



ప్రకటనకర్త

కురుకూరి సుబ్బారావు,
బుక్సెల్లర్ అండ్ పబ్లిషర్,
భీమవరోలు, పశ్చిమగోదావరిజిల్లా.



కాకినాడ:
కోటమర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.
1926.



వెల రు. 1-0-0

# రామదాసు

[గ్రంథకర్తలు:—రామనారాయణకవులు]

భద్రాచలరామదాసు నెఱుంగని యాంధ్రులలో నెవ్వరుందురు? ఆంధ్రులందఱును వ్రతప్రయాసములకోర్చి ప్రతిసంవత్సరము నరుగుచున్న భద్రారణ్యమధ్య క్షేత్రమే! శ్రీరామదాసుఁడగు కంచెర్ల గోపన్న, యీపురమున రామాలయమును నిర్మించి యందులకై తానీషాధనమును వ్రయపఱచిన కారణమున పండ్రెండేండ్లు కారాగారమున నున్న భక్తిరసపూరితదివ్యచరిత్రము! శ్రీరామదాసు గోలకొండలోని చెఱసాలలోఁబడి శ్రీరామనామమే జీవనముగ భక్తిపరవశుఁడై పాడినపాటలను మన మనేకమారులు వినియుందుము. భిక్షుకుల దీనారావములయందును, దాసరుల తంబురలందును, భక్తుల పారవశ్యములయందును భాగవతుల పదఘట్టనములందును మూర్తీభవించిన వీరామదాసుగారి పాటలే! నిర్జనములగు నరణ్యముల మధ్యమునుండి, మహోన్నతములగు నంతరాళము నుండి అగాధమగు సాగరాంతరమునుండి, దివ్యకంఠములనుండి శ్రోత్రపేయము చేయునవి యీ రామసంకీర్తనములే!

ఈరామదాసుగారు కారాగారప్రాకారములనడుమ, భక్తితన్మయుఁడై పద్మాసనమువేసికొని, యీమహాప్రపంచమున శ్రీరామునితో నాయప్పవాకిమ్మని తగవులాడినాఁడు. ఒక్కొక్కప్పుడు రామా అపచారము సల్పితివని, యాతనిపాదములపైఁ బడి చిన్నపిల్లవానివలె నేడ్చినాఁడు. మఱొకప్పుడు రామునిఁజూచి వెఱ్ఱివానివలె నూరక నవ్వదొడఁగినాఁడు. ఆహా రామభక్తిప్రబోధము! ఈభాగములన్నియు నీనాటకరాజమున కవిబ్రహ్మచేఁ జిత్రింపఁబడినవి!

తానీషా రామదాసుల పూర్వజన్మచరిత్రలు-కబీరు నాదేశమున, రామదాసు శ్రీరాముని జాడగోర, రాముఁడు మహిషాకారమునరాగా రామదాసు భగవంతుఁడని యెఱుంగక కొట్టుట, శ్రీరాముని తాడనముచేసి నందులకై రామదాసు కారాగృహములో దెబ్బలుతినుట, ఆలయనిర్మాణము, రామదాసు పుత్రుడు మరణించి రామానుగ్రహమున జీవించుట, తానీషా ఆగ్రహము, రామదాసు తానీషాల సంవాదము రామలక్ష్మణులర్ధరాత్రి రాజభటవేషములతో తానీషాఅంతఃపురముఁ బ్రవేశించి సంవాదము చేయుట, తానీషాకు సొమ్ముచెల్లించి యారశీదు ప్రాణభీత్యా ప్రయత్నమునవున్న రామదాసునకు కారాగృహమున నిచ్చియదృశ్యులగుట, తానీషా క్షమార్పణము, రామదాసు భద్రాచలమున శ్రీరామ కైంకర్యము చేయుట-భక్తిరసభరితములగు పాటలతోనున్నది. చదువవలసిన నాటకము. వెల 1—0—0

# భగవద్గీత.



## ప్రథమాధ్యాయము.



### అర్జున విషాదయోగము.



శ్రీకర అనసూయాత్మజ
లోకాధిప వాసుదేవ లోకస్తుత్యా
నాకేశార్చిత శ్రుతిచయ
సాకారప్రసిద్ధకాయ సాత్యవతేయా. 1

వ. ధృతరాష్ట్రుం డిట్లనియె. 2

సీ. సంజయ వినవయ్య సర్వసౌఖ్యములచే
భూమికి నాభినా పుణ్య మొంది
విలసిల్లుచున్న యా విపులకురుక్షేత్ర
మునను మదీయులు ననఘులైన
పాండవేయులఁ గూడి బద్ధవిద్వేషులై
సమరంబునకుఁ దారు సమత బొంది
యెద్ది చేసిరి యుద్ధ మెట్లెట్లు చెల్లెన
యుత్సహించినవారి యురుబలంబు

తే. గీ. లెట్లు వర్తిల్లె దానిని యేర్పరించి
తెలియఁబలుకుము నాతోడ ధీవరేణ్య
వినఁగ వేడుకయయ్యె సవిస్తరముగఁ
బ్రవిమలం బగు బుద్ధిచేఁ బ్రబల మొంది. 3

వ. అనిన విని సంజయుఁ డిట్లనియె. 4

తే. గీ. పాండవేయుల మూకలఁ బారఁజూచి
నీ కుమారాగ్రజుఁడు రాజనీరజాప్తుఁ
డడరి యాచార్యుఁ గనుఁగొని యధిగమించెఁ
బల్కె నొకమాట యాతనితో భక్తిమీఱ. 5

తే. గీ. చూడు మాచార్యవర్య యో శుద్ధహృదయ
పాండవేయులు మహనీయభద్రసేన
ద్రుపదసుతుచేత నీశిష్యు దోర్బలంబు
చేత శ్రేష్ఠత వర్తిల్లి చెలఁగుదాని. 6

తే. గీ. పాండవేయుల మూకలో భద్రయశులు
అనికి భీమార్జునులసము లైనవారు
విరటుఁడును సాత్యకియు మహావిపులయశులు
ద్రుపదుఁడును నని పల్కెఁ దా నృపవరేణ్య. 7

వ. మఱియును దృష్టకేతుండును, చేకితానుండును, వీర్యవంతుండగు
కాశిరాజును, పురజిత్తును, కుంతిభోజుండును, నరపుంగవుఁడగు
శైబ్యుండును. 8

తే. గీ. ఉరుబలుండు సుధామన్యుఁ డుర్వినాథ
వుత్తమౌజుండు సౌత్రి కర్ణోత్తముండు
ద్రౌపదీనందనులు సుభద్రాసుతుండు
విపులయశులు మహారథవీరు లనఘ. 9

తే. గీ. నామహాసేనయందలి నాయకులను
నీ వెఱుంగుదు వేకదా నిర్మలాత్మ
అయిన వారల సంజ్ఞలు నన్వయించి
చెప్పెదను విను సుజ్ఞానసిద్ధహృదయ. 10

తే గీ. నీవు భీష్ముండు కర్ణుఁడు నిపుణు లనఘ
కృపుఁడు సమితింజయుండును విపులమతులు

తే. గీ. మామల సుహృజ్జనముల మఱియుఁజూచె
నుభయ సేనలలోపల నురుబలుఁడు
సర్వబంధుజనంబుల సర్వసేన
నప్పు డంతటఁ జూచి యయ్యర్జునుండు. 30

తే. గీ. కృప మనంబున వసి యుంపఁ గృష్ణుతోడ
దుఃఖమునఁ బల్కె మాటలు దొట్రుపడఁగ
యోధజనముల నావారి యొనరఁ గంటిఁ
గాన చిత్తంబు సంతాపకలిత మయ్యె. 31

తే. గీ. అంగనీచయంబు డస్సె నో యపరిమేయ
ముఖము వాడెను జ్ఞానంబు మోసమయ్యె
దేహమునఁ గంప మొనవెను దేవదేవ
పులకతతు లంకురించెను బూర్ణముగను. 32

తే. గీ. చేతి గాండీవ ముండక చెదరఁజొచ్చె
దేహమునఁ జాల తాపంబు తెరలఁజొచ్చె
నిలువనోపను రథముపై నిర్వహించి
భ్రాంతి నొందెడిమాటల భ్రమసె మనము. 33

తే. గీ. ఘననిమిత్తచయంబులు గానఁబడియె
పెక్కువిపరీతములుగాఁగఁ బెంపుదప్పెఁ
గాన లాభంబు యేమియుఁ గానఁబడను
సమరముఖమున బాంధవ సంహృతముగ. 34

తే. గీ. కోరనెల్లను విజయంపుఁగోరికలను
రాజ్యకాంక్షను బాసితి రాగ మెడలి
రాజ్య మెల్లను మిక్కిలి రమ్యమైన
భోగ్యములు నెల్ల బ్రతుకును బొందనెల్ల. 35

తే. గీ. ఏ మహాత్ములకొఱకునై యీరణంబు
చేసి రాష్ట్రంబు గూర్పంగఁ జెలఁగినాఁడ
వారలే ప్రాణ ధన ముఖ్య వాంఛ విడచి
యుద్ధసన్నద్ధులై యిట నున్నవారు. 36

వ. వార లెవ్వరంటేని యాచార్యులును, మిత్రజనంబులును, పుత్రవర్గంబులును, పితామహులును, మాతులసమూహంబును, పౌత్రులును, మఱఁదులును, యితరమగు సంబంధులును. 37

తే. గీ. వీరు మమ్ములఁ జంపెడు వివతులైన
వీరిఁ జంపంగ త్రైలోక్య విభవ మబ్బె
నేని నేనొల్ల యీరాజ్య మేలుటెంత
వీరిఁ జంపను నాచేత వెలయఁ గాదు. 38

తే. గీ. ధార్తరాష్ట్రులఁ జంపుట తగినదైన
దీనవాకును సంప్రీతి దెలియ లేదు
దీనివల్లను పాపంబె కాని కృష్ణ
ధర్మవిద్వేషులైన తతాయులైన. 39

తే. గీ. కాన వారలఁ జంపుట కాదు నాకు
ధార్తరాష్ట్రులు బాంధవతతులు గాన
స్వజనములఁ జంపి నంపుల వచ్చినట్టి
సుఖము బొందుట యదియేటి సుఖము కృష్ణ. 40

తే. గీ. కులము నాశంబుబొందించు కలుషభరము
బంధుజనులను జంపెడు పాతకంబు
లోభహతచాతసుప్తుడై లోలుఁడైన
హీనమతి కౌరవేశ్వరుఁ డెఱుఁగకున్న. 41

తే. గీ. కులజబాంధవహాననంబు కౄరమనుచు
నెఱుఁగవలదె మాకైనను యుద్ధచరిత

యెఱిఁగి యెఱిఁగియు దీనిని నెట్లు సేతు
పాపవర్తన మర్హంబె ప్రాజ్ఞులకును. 42

తే. గీ. శాశ్వతం బగు కులధర్మసంచయంబు
చెడుగు లక్షయ మొనరింప శేషతల్ప
ధర్మమెడలినయప్పు డధర్మ మొదవి
కులము నాశంబుఁ బొందించుఁ గువలయాక్ష. 43

తే. గీ. విను మధర్మంబు మిక్కిలి విస్తరిల్లె
ధర్మపత్నుల నడకలు దప్పఁజేయు
ధర్మపత్నుల నడకలు దప్పినపుడె
వర్ణసంకర ముదయించు వారిజాక్ష. 44

తే. గీ. వర్ణసంకరకారులు వనజనాభ
వంశహంతలు కల్మషవర్తనమున
వారి పెద్దలు నరకనివాసు లగుదు
రోలిపిండోదకక్రియాలోభమునను. 45

తే. గీ. వర్ణసంకర మొదవించుఁ దరతరంపు
పాతకంబులచేత నో పద్మనాభ
శాశ్వతస్థితి నే ప్రొద్దు జరగుచుండు
జాతి కుల ధర్మచయములు జాఱిపోవు. 46

తే. గీ. జాతికులధర్మములు దన్ను జాఱనిచ్చు
నరుల కెప్పుడు నరకంబు ననుచు నిటుల
ననఁగ నే విందు నార్యవచనముచేతఁ
గృష్ణ విజ్ఞానమహిమనివృత్తతృష్ణ. 47

తే. గీ. అహహా! మహనీయపాతక మని యెఱింగి
యెల్లు గావించు నీకృత్య మేల దేహ

మనఘు రాజ్యమహాలోభ మనుసరించి
బంధుజనులను బొలియించఁ బోఁడియగునె. 48

తే. గీ. ధార్తరాష్ట్రులు రణమునఁ దంష్ట్రులైన
శస్త్రధారులలో శస్త్రసమితి వార
లుండుటే నాకు శ్రేయంబు నోదనఁ జేయు
చేరి వా రని చేసినఁ జేయునిమ్ము. 49

వ. మఱియు ధృతరాష్ట్రునితో సంజయుం డిట్లనియె. 50

తే. గీ. పార్థుఁ డిబ్భంగి హరితోడఁ బలికిపలికి
సశరచాపంబు రథముపై జాఱవిడచి
దుఃఖసంతప్తచిత్తుఁడై దుర్బలతను
స్యందనోపాంతమున నుండె జనునిమాడ్కి. 51

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వాసుదేవ ద్వాదశాక్షరీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేములగంటి పురనివాస ఆప
స్తంబ సూత్ర హారితసగోత్ర గాయమాంబా గర్భసం
జాత నాగోజీపండితపుత్ర దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునందు
ప్రథమాధ్యాయము



శ్రీరస్తు.

# భగవద్గీత.

## ద్వితీయాధ్యాయము.

### సాంఖ్యయోగము.

వ. ధృతరాష్ట్రునితో సంజయుఁ డిట్లనియె

తే. గీ. అట్లుగాఁ దన్ను సత్కృప యనుగమింప
నేత్రముల నశ్రుధారలు నిర్వాటిల్లఁ
జివుకుచుండెడు నర్జునుఁ జేరవచ్చి
పలికె నొకమాట దేవకీపట్టి యపుడు.

తే. గీ. కశ్మలం బైన యీవంటి కల్మషంబు
విషమవృత్తియు నాద్యంబు విగతకీర్తి
స్వర్గదూరంబు నిన్నెట్లు సంశయించె
పార్థ! నగదూర సంగరభయవిదూర.

తే. గీ. పిఱికితన మింత నీమేనఁ బెనఁగనీకు
తగను నీశౌర్యమున కీ యధైర్యశీల
హృదయదౌర్బల్య మొదవించు హీనవృత్తి
విడిచి యుద్ధంబునకు లెమ్ము విమలచరిత.

వ. అనిన విని యర్జునుం డిట్లనియె.

తే. గీ. భీష్ముడును ద్రోణుడును చాల పెద్ద లనఘ.
బాణజాలంబులను వీరి భండనమున
పాడవఁగా నాకు నుచితమె పుణ్యావర్య
పూజనీయులు కేవల భూరియశులు.

సీ. తగునయ్య వీరలఁదలఁపక తెగటార్చి
యర్థకామ్యంబుల ననుభవింప
వీరు మహాత్ములు విశ్రుతకీర్తులు
బ్రహ్మవిద్యాతత్త్వపారగులును
మహనీయ తేజుల మడియించి వీరల
రక్తసిక్తంబైన రాజ్యసుఖము
కుడుచుట యీమహాక్రూరదుష్కర్మకంటెఁ
దపసినై క్షత్రియధర్మ మొఱలి
తే. గీ. లోకముల నెల్లవారును లోనుగాను
భిక్షమెత్తి భుజించుట ప్రీతి నాకు
దీనికంటెను శ్రేయంబు దేవతాఢ్య
కలుగ నేరదు చూడ్కికి కమలనయన. 7

సీ. కాదఁటో వీరలు ఘనులో నాకంటెను
వీరెయౌను నేను విదితబలినో
వీరల గెల్తునో వీరలే నను గెల్తు
నారలో మఱియుఁ గేవలము వినుము
వీరలే నాచేత వెలయంగఁ జత్తురో
వీరిచేఁ జత్తునో విభునియుక్తి
యీయుద్ధములలోన నెయ్యది శ్రేష్ఠమో
హిత మెయ్యదియొ నాకు నెఱుఁగఁబడదు
తే. గీ. చంపరానట్టి ధృతరాష్ట్ర జగతినాధు
పుత్రవర్గంబు నామ్రోలఁ బోరిలోన
యుద్ధసన్నద్ధులై నిల్చియున్న వారు
బంధుజనులును గానిసంపదలు గలవె. 8

తే. గీ. కృపణతాదోషమున బుద్ధి గీటుపడఁగ
ధర్మమార్గంబు దెలియనే తత్వమునను
శిష్యుఁడను నీకు నే దృఢ శ్రేయ మెద్ది
యడుగుచున్నాఁడఁ దెలుపవె యనఘపురుష. 9

వ. వినుము దేవోత్తమ! ప్రధానపురుష! రుక్మిణీవల్లభా! యిపుడు
సంప్రాప్తంబైన మదీయశోకంబును, దీనిచేతనయిన యింద్రియశో
షణంబును మాన్పుకొనఁ జికిత్సఁ గాన నేరను. నిష్కంటకంబైన సకల
సౌఖ్యకరంబైన రాజ్యంబు తత్సుఖావాప్తియు నత్యంతసుఖకరంబగు
దేవతాధిపత్యంబును గలిగిన నేని యీదుఃఖనివృత్తి గాదని పలికె
నని యిట్లు నరనారాయణ సంవాదంబు సంజయుఁడు దృతరాష్ట్రు
నితోఁ జెప్పి మఱియు నిట్లనియె. 10

తే. గీ. ఇట్లు కృష్ణు నర్జునుం డెలమిఁబలికి
దేవదేవేశ శ్రీకృష్ణ దివ్యపురుష
యుద్ధ మొల్లను దీనిపై నుత్సహింప
నని నిరుత్తరుఁడై యుండె ననికిఁ బాసి. 11

తే. గీ. అతనిఁ జూచి ముకుందుం డచ్యుతుండు
పలికె చిఱునవ్వు మోమునఁ బ్రభలసిన
నుభయ సేనలలోపల నూరకున్న
నర్జునుని వైరిరాజన్యభర్జనునిని. 12

వ. భగవంతుం డైన శ్రీకృష్ణుం డిట్లనియె. 13

తే. గీ. దుఃఖపడఁ గాని పనికేల దుఃఖపడెదు
ప్రజ్ఞ లెన్నేనఁ బలికెదు ప్రాజ్ఞువోలె
పోలసిపోయెడునట్టియుఁ బోలయునట్టి
బాంధవులఁ గూర్చి పండితుల్ భ్రాంతిపడరు. 14

తే. గీ. నాకు జన్మంబు మరణంబు నరుఁడ లేదు
నీకు రాజన్యవరులకు నెన్న లేదు
యిందులకుగాను యీచింత నొంద నేల
చలన మొందియు మదిలోన జంక నేల. 15

తే. గీ. దేహి కీవర్తమానపు దేహమునను
బాల్య కౌమార యౌవన ఫలిత మెట్టు
లట్ల యగు మారు దేహములంద జూచి
ధీరులగువారు మోహముల్ దీనఁబడరు. 16

తే. గీ. ఇంద్రియంబుల భోగంబు లెన్ని యేని
దలప శీతోష్ణ సుఖదుఃఖము లను జెఱుచు
ఆగమాపాయముల చేత యడరియుండు
వాసిచే సుఖదుఃఖముల్ వరుస నొప్పు. 17

తే. గీ. ఇట్టి యింద్రియవృత్తుల నెఱిఁగినట్టి
భద్రచిత్తుండు దుఃఖంబు పడయకుండు
సౌఖ్యదుఃఖములందును సమత దాల్చు
వానిఁ జెందును మోక్షంబు వరుసతోడ. 18

తే. గీ. చెడనిదానికి నాశంబు జెందరాదు
చెడెడుదానికి శుభ మొందు జెందరాదు
దీని దృష్టాంత మెప్పుడు తెల్లమగును
తత్వవేత్తల చూడ్కులఁ దగిలియుండు. 19

తే. గీ. చెడని దదియని యెఱుఁగుమా చిత్తమునను
సర్వసాక్షిత్వమున నెద్ది సమ్మతంబు
ప్రకట సుఖదుఃఖరహితసద్బ్రహ్మమునకు
చేటు లేశంబు నెవ్వది చేయ లేదు. 20

తే. గీ. అంత గములైన దేహము లనఘచరిత
జీవు లెప్పుడు నిత్యులై చెలఁగువారు
యిదియు యుద్ధమటంచు నో యిద్ధచరిత
కనుచు శస్త్రాస్త్రములు దాల్చి యనికి లెమ్ము. 21

వ. వినుము జీవుం డొకనిచేతఁ జచ్చుననుట యు, దా నొకనిఁ జంపు
దుననుటయు యీరెండును మిథ్యగా నెఱుంగుము. 22

సీ. ఆత్మ నిత్యుండయ్యు నమరు నేవేళను
చావదు దేహంబు చనెడు వేళ
స్వస్వరూపంబున చరియించు దేహియై
పుట్టు నిర్దేహియై పుట్టుచుండు
నిత్యుఁడై యాత్మ దా నిలిచి యుండేవేళ
శాశ్వతమూర్తియై జరగుచుండు
భూరిపురాకృతస్ఫురణ కర్మగు ద్రిప్పు
చావదు దేహము చంపఁబడఁగ

తే. గీ. దేహి ప్రాగ్దేహమును బాసి దేహమునకుఁ
బోవు చుండును వానితోఁ బొలయకుండు
చేతనప్రభవాత్ముఁడై చెలఁగుచుండు
జన్మకర్మంబులందున జతపడండు. 23

తే. గీ. నాశరహితుండు నిత్యుండు నాకుఁ జూడ
నజుఁడు నవ్యయుఁడునైన యమలపురుషుఁ
డెఱిఁగి యీ జీవుఁడెట్లకో యేది చంపఁ
దలఁచు చంపిన మనుజుండు తత్వ మెడలి. 24

. కోకలు జీర్ణమై చనఁగ గొబ్బున వాని పరిత్యజించి తా
శ్రీకరనూత్నవస్త్రములఁ జెల్వుగఁ దాల్చిన భంగి దేహి సు

శ్లోకుఁడు వృద్ధదేహమును రోసి యశాశ్వతజీర్ణమూర్తి యీ
లోకపుకోమలాంగమును లోలతఁ దాల్చు నవిద్యవెంబడిన్. 25

తే. గీ. జీవుఁ డస్త్రాలచేత నచ్ఛేద్యుఁ డనఘ
అగ్నిదేవునిచేఁ గాల్ప ననువుపడఁడు
ఉదకములు వీనిఁ దడుపఁగ నోపలేవు
వాయువుల శోష మొందింప వశముగాదు. 26

ఉ. ఛేదమునందుఁ జెందడును జేర్పడి దాహమునొందఁ డెప్పుడున్
క్లేదము నొందకుండు మఱి కేవలశోషమువాఁడుగాఁడు స
మ్మాదియు నిత్యవస్తువు నమోఘతరస్థితి సర్వగుండు నై
యాదిని బోలు శాశ్వతుఁడు నాతఁడు సంచలమొందఁ డార్యుఁడై.

వ. మఱియు నవ్యక్తుండు నచింత్యుఁడును నవికారుఁడనఁగా దేహంబు బాల్యయౌవన వార్ధక్యంబులను బొందుచుండంబున వికారంబులఁ బొందని వాఁడును, అందువల్ల నట్టి జీవుని శరీరంబు పరివర్తింపఁజేయు చేతనంబున కీ కర్మఫలానుభవంబునకుఁ గర్త కాఁడని యెఱింగితేని నీచేతఁ జంపంబడు దేహంబులతోను జావఁడని శోకింపకుండు.

తే. గీ. పుట్టువాఁడును జీవుండు పొలయువాఁడు
జీవుఁడే యని మదిలోనఁ జెప్పనేల
చావుఁబుట్టువు గలిగిన జంతుతతికి
దుఃఖ మలవడు నీకేల తొట్రుపడను. 29

తే. గీ. పుట్టినప్పుడె మృత్యువు పొందియుండు
చచ్చినప్పుడె జన్మంబు సంభవించు
దీని మాన్పంగ బ్రహ్మాదిదేవతలకు
వశము గాకుండు దీనికై వగవనేల. 30

వ. వినుము శరీరంబులు జన్మాదిని కారణస్వరూపంబులును, జన్మమరణ మధ్యంబున వ్యక్తరూపంబులుగను, మరణకాలంబున వెండియుఁ

గారణస్వరూపంబులు నగుటంజేసి వానియందున దుఃఖంబు వలదు
వలదు. 31

తే. గీ. ఆత్మఁ గొందఱు వీక్షింతు రద్భుతముగఁ
బలుకుదురు గొంద ఱద్భుతం బలరుచుండఁ
గొంద రద్భుత మొందఁగ విందు రనఘ
యెవ్వరును నిశ్చయంబుగ నెఱుఁగ లేరు. 32

తే. గీ. జీవుఁ డెప్పుడు నిత్యుఁడై చెడనివాఁడు
సర్వదేహాధికములందు సమతదగిలి
కాన జీవాత్మలను గూర్చి కష్టతరపు
దుఃఖ మందంగ నేటికి దోర్బలాఢ్య. 33

తే. గీ. యుద్ధధర్మంబు నీదిగా యుక్తి నెఱిఁగి
కంప మొందఁగ నేటికి కలుష మనుచు
ధర్మయుద్ధంబుకంటెను దగిన శ్రేయ
మనఘ క్షత్రియవరునకు నరయ లేదు. 34

తే. గీ. కోర కంతయుఁ దనుదానె కోరి వచ్చు
చెడని స్వర్గసుఖోన్నతి చేరినట్లు
ధర్మయుద్ధంబు క్షత్రియతతికిఁ గలుగ
సౌఖ్య మొందుదు రనఘాత్మ సకలనృపులు. 35

తే. గీ. కాక యీధర్మసంగ్రహ కాంక్ష మాని
యుద్ధ మిప్పుడు చేయకయుండితేని
నీదుధర్మంబు కీర్తియు నీచ మగును
పాపసంఘంబు నీయందుఁ బ్రాప్త మగును. 36

తే. గీ. అఖిలభూతంబులును నీదు నవయశంబు
చాటి నీలోకములయందు శౌర్యధుర్య

దుష్టకీర్తి యొకించుక దొడ్డ లెక్కేని
చావుకంటెను ఘనముగు సజ్జనునకు. 37

తే. గీ. రణమువల్లను భీతుగా రథికులెల్ల
నిన్నుఁ దలఁతురు రాజన్యనివహములను
వీరిలోపల సన్మార్గవృత్తిఁ దనరి
లాఘవము నొందు టిది రాజలక్షణంబె. 38

తే. గీ. నీదు శాత్రవు లిప్పుడు నిన్నుఁ జూచి
పరిహసింతురు ప్రేలైన ప్రల్లదముల
నిందచేతురు సామర్థ్యనిపుణుఁ డనరు
యింతకంటెను మఱి దుఃఖ మేది పార్థ. 39

తే. గీ. చచ్చితేనియు స్వర్గంబు సంభవించు
బ్రతికితేనియు రాజ్యంబు ప్రాప్తి గల్గు
కాన యుద్ధంబు యెడను యీ కలక మాని
లెమ్ము శస్త్రాస్త్రములు దాల్చి సమ్మదమున. 40

తే. గీ. సౌఖ్యదుఃఖంబులును రెండు సమత జూచి
లాభమును నష్టములయందు లక్ష్య మిడక
జయ మపజయము సమముగా జరిపి నీవు
రణము చేయుము పాపంబు రాదు దీన. 41

తే. గీ. సాంఖ్యమంతయు మది నీకు జరుగదేని
పొసఁగ యోగంబునందైన బుద్ధి నిలుపు
బుద్ధి యోగంబుతోడుత పొదవితేని
కర్మబంధంబు విడుచుటఁ గాంతు వనఘ. 42

తే. గీ. అట్టిధర్మంబునను నీకు హాని లేదు
ప్రత్యవాయంబు దీనిచేఁ బ్రాప్తమునకు

స్వల్పతరధర్మ మసియెడు చండకరుఁడు
పరమసంసారతిమిరంబు పాయఁజేయు. 43

తే. గీ. కర్మ మీశ్వరసంతృప్తిగా నొనర్చు
పలిసినసద్బుద్ధి యేకమై యలరుచుండు
కామిమైై యోగ మెఱుఁగని కష్టజనుని
కనఘ బుద్ధులు పెక్కులై యలరుచుండు. 44

వ. మఱియు యోగరహితులై వేదంబులయందు కర్మవిధానంబుగా వాదించువారు కర్మంబుకంటె నన్యంబు లేదని పుష్పితంబులై ఫల రహితంబులైన రంజకవాక్యములచేతఁ బలుకుచుందురు. 45

తే. గీ. స్వర్గపరుఁడైన కామి తా సంతతంబు
జన్మకర్మఫలంబుల జరుగనిచ్చు
నలర భోగము లైశ్వర్యములగుఱించి
కర్మచయములు బహుళంబుగా నొనర్చు. 46

తే. గీ. భోగసంపన్నతాకాంక్ష బూరయునట్టి
పుష్పితాలాపనిర్గతబుద్ధులకును
నిశ్చలాత్మక మగుచు నుద్ధిల్లు తెలివి
పుట్టనేరదు ధ్యానవిస్ఫూర్తినందు. 47

సీ. సత్వరజస్తమసాంజ్ఞలఁ దనరారు
త్రిగుణంబులను సమర్థించి చూడ
త్రైగుణ్యవిషయమై తనరు వేదంబులు
కర్మంబులందును గలిగియుండు
కాన నీ త్రైగుణ్యకత్వంబునను జెందు
వేదోక్తములచేత వెలయకుండు
సంస్కృతిద్వంద్వముల్ సమయించి మెలగుము
కర్మఫలంబులకాంక్ష మాని

తే. గీ. నిత్యమును సత్యసంపద ల్నిలిచియుండు
పొందరానిది గోరకు పొందఁబడిన
యర్థములయందు సంతోష మొంద నీవు
యప్రమత్తుండ వైయుండు మనుదినంబు. 48

వ. వినుము సకలసజ్జనులందురు, సకలవాపీకూపతటాకంబులందుఁ గల్గు స్నానాద్యనుష్ఠానఫలంబులు నొక్క సముద్రంబునందుఁ గలుగుచందంబున వేదంబు లనుగుణించిన సకలకర్మఫలంబులును హృదయంబున బ్రహ్మావలోకనంబుఁ జేయు యోగీశ్వరునకు సంభవించు నిస్సంశయంబు. 49

తే. గీ. కర్మములు సేయనోపెదు ఘనుఁడ నీవు
కర్మఫలములపై వాంఛ గలుగ నీకు
ఫలము లొందవించుఁ గర్మంబు పట్టు వదలు
కర్మ మొనరించు తత్ఫలకాంక్ష విడచి. 50

తే. గీ. యోగమునయుండి కర్మను లొప్పఁజేయు
కర్మసంఘంబు విడనాడి ఘనత మీఱి
కర్మసిద్ధులు లేకున్న గలిగియున్న
సమత వర్తిల్లు పురుషుండు సౌమ్యయోగి. 51

తే. గీ. బుద్ధియోగంబుచేతను పొలపుమీఱి
దూరములుగాఁగ కర్మముల్ ద్రోచిపుచ్చు
ఫలము కాంక్షించు కాముకుల్ బహుళముగను
దైన్యమును బొందుచుందురు మాన్యచరిత. 52

తే. గీ. బుద్ధియోగంబుచేతను పొలయఁజేయు
సుకృతమును దుష్కృతము రెంటి శుద్ధహృదయ
కర్మములకౌశలంబు యోగంబె వినఁగ
కాన యోగంబు మదిలోనఁ గాంచు మనఘ. 53

తే. గీ. కర్మఫలములఁ దెగఁగోసి కాంక్షఁ బాసి
బుద్ధియోగంబుచేతను బొదలువారు
జన్మబంధంబులందును జడత పడక
చెడని వైష్ణవపదమును జెందువారు. 54

తే. గీ. ఎప్పుడైనను నీబుద్ధి తప్పు లేక
మోహసలిలాబ్ధి దాఁటిన మోహమహిమ
యపుడు విడుతువు పార్థ వేదార్థతతుల
విననగఁ దగియున్నవానిని విన్నవాని. 55

తే. గీ. తలఁచు లౌకికవైదికార్థములచేత
నధికవికలతఁ బొందినయట్టి నీదు
విపులబుద్ధి సమాధియె డెపుడు నిలుచు
నపుడె యోగసంప్రాప్తిని నందఁగలవు. 56

వ. అనిన విని యర్జునుఁ డిట్లనియె. 57

తే. గీ. ప్రాజ్ఞుఁడని యెందుచేతను బలుకఁ దనరు
నాతఁ డెట్లు సమాధియం దలరుచుండు
పలుకు నెయ్యది బుద్ధిసంపన్నుఁ డగుచు
నెచటఁ గూర్చుండు నెచటికి నేగుచుండు. 58

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 59

తే. గీ. మనసులోపలి కోర్కులు మగుడఁబెట్టి
యాత్మచేతను బ్రహ్మంబు నలరఁజూచి
సంతసం బందు నెవ్వఁడు సంతతంబు
ప్రజ్ఞ తా నందఁగలఁడని పలుకఁబడును. 60

తే. గీ. దుఃఖ మడరినదానితోఁ దొట్రుపడక
సుఖము జెందిన రాగవిస్ఫురణ మాని

వీతరాగభయక్రోధజాతుఁ డగుచు
నలరు నాతని స్థితి బుద్ధి యనఁగఁబడును. 61

తే. గీ. పుత్రమిత్రులయందలి పొందు మాని
సుఖము జెందినవేళల శుద్ధపలుకు
నశుభ సంప్రాప్తివేళల నడలుపల్కు
పలుకకుండెడు నాతఁడు ప్రాజ్ఞుఁ డనఘ. 62

తే. గీ. అనఘ విను కూర్మ మంగము లన్ని యణఁచి
నట్లు యింద్రియముల విషయాశ నిడక
మఁగుడ మథియించ నేర్చిన మహిత యశుఁడు
ప్రాజ్ఞుఁ డని వానిఁ దెలియంగఁబడును పార్థ. 63

వ. వినుము నిరాహారునకు విషయానుభవసామర్థ్యంబు లేకయుండియు నభిలాషంబు మానిన యోగికి నకాంతముంబుగా విషయనివృత్తి యగుఁ గావున. 64

తే. గీ. మనము యోగంబుతోఁగూడ మనల జేసి
యింద్రియంబుల నియమింప నెఱుఁగకున్న
మనము నాయింద్రియమ్ముల మఁగుడఁబట్టి
యింద్రియంబులు దుష్టంబు లింద్రపుత్ర. 65

తే. గీ. కాన నింద్రియచయములఁ గట్టువఱిచి
మనము నా మూర్తియందును మఁరగఁజేసి
యింద్రియంబుల చేఁగూర్ప నెఱుఁగువాని
పలుకుదురు లోకులెల్లను ప్రాజ్ఞుఁ డనుచు. 66

తే. గీ. విషయములయందు సంప్రీతి విడువలేని
వానియందున సంగంబు వరుసఁ బుట్టు
సంగమునఁ జేసి కామంబు సంభవించుఁ
గామమున క్రోధ మప్పుడె గలుగు ననఘ. 67

తే. గీ. క్రోధమునఁ బుట్టు మోహంబు కొఱత లేక
మోహమునఁ బుట్టు విస్మృతి ముందుగానె
స్మరణ ముడిగిన బుద్ధి నాశంబు కలుగు
బుద్ధినాశంబువలననె పొలసిపోవు. 68

తే. గీ. రాగ వైరంబులందును రాగి గాక
విషయములు నింద్రియములతో వేగ బాసి
బ్రహ్మమందును జీవుని పాదుపఱిచి
బ్రహ్మసత్కృప పురుషుండు బడయవలయు. 69

వ. ఈచందంబున భోగరహితుం డైన దేహికి యింద్రియనిగ్రహంబు
వలన భోగ్యంబులు నివర్తించుఁ గాన కాంక్షలు నివర్తించి బ్రహ్మ
వలోకనంబున భవ్యుఁ డగును. 70

తే. గీ. అమ్మహాత్ము ప్రసాదంబు అఖిలదుఃఖ
హాని గావున దుఃఖంబు లణఁచుఁ బార్థ
మనము దా సుప్రసన్నతఁ బరఁగె నేని
బుద్ధి యాతనిలోపలఁ బొందుచుండు. 71

తే. గీ. యుక్తచిత్తుఁడు గాకున్న నుడుగుబుద్ధి
బుద్ధి లేకున్న భావన పొలసిపోవు
భావనాశూన్యునికి శాంతి పరఁగ లేదు
శాంతి లేకున్న సౌఖ్యంబు జరుగకుండు. 72

ఉ. కావున యింద్రియార్థములఁ గైకొని చిత్తము దానితోడనే
పోవుచు యోగమార్గమును బొందఁగ నొల్లనివాని ప్రజ్ఞయన్
నావ పయోధిమధ్యమున నాలుక వాయువశంబు చేతఁ దాఁ
బోవుచుఁ గీడ్వడిక్రియను భూరియశోధన కీడ్వడున్ జుమీ! 73

తే. గీ. కాన యింద్రియనిచయంబు కాంక్షలందుఁ
బొందనియ్యక కుదియించు భూరియశుని

యెల్లలోకములందును యెన్నఁబడును
ప్రాజ్ఞజనములలోపలఁ బ్రాజ్ఞుఁ డనుచు. 74

వ. మఱియు యోగీశ్వరులకు సంసారులగుమానవులు వర్తించు దివస బాధకారంబైనరాత్రియై తోఁచు. సంసారిజనంబుల కలకలధ్వని వర్తకంబై నిద్రించు రాత్రి యోగివరేణ్యులకు దివసంబైయుండును.

మత్తకోకిల. సర్వమైన విసంచయంబులు సంశ్రయించి వసింపఁగా
నిర్వహించి చలింపకుండెడి నీరధింబలె యోగియున్
సర్వకామచయంబుఁ దన్నును సంశ్రయించినదానిచే
దుర్వికారుఁడు గాఁడు శాంతిఁ దూఁగ నిస్థితి యర్జునా. 76

తే. గీ. కామచయములు వెఱఁగోసి కలకఁ బాసి
నిత్యుఁడగువిష్ణుమూర్తిని నిలిపి మదిని
మమత బాసి యహంకారమహిమఁ ద్రోచి
చెలఁగుపురుషుఁడె శాంతిని జెందుఁ బార్థ. 77

తే. గీ. ఇట్టి బ్రహ్మానుభవముచే నెప్పుడైన
మగిడి సంసారమోహంబు మరగఁ డెపుడు
దీని మరణంబునందైనఁ దెలిసెనేని
బ్రహ్మనిర్వాణ మొందును బాండవేయ. 78

గద్య.

ఇతి సకలసుకవిజనసేవాపరాయణ శ్రీవాసుదేవ ద్వాదశాక్షరీమంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురుపరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య గురుకులతిలక యోగీంద్రచూడామణి శ్రీనరసింహదేవ గురువరేణ్య శ్రీపాదపద్మారాధక వేఁకటగిరిపురనివాస ఆపస్తంబసూత్ర హారితసగోత్ర గాయమాంబాగర్భసంజాత నాగోజీపండితపుత్త్ర దత్తోజీపండిత ప్రణీతంబైన భగవద్గీతాశాస్త్రంబునందు ద్వితీయాధ్యాయము.

శ్రీరస్తు.

# భగవద్గీత.

## తృతీయాధ్యాయము.

### కర్మయోగము.

వ. అనిన విని అర్జునుం డిట్లనియె.

తే. గీ. కర్మమునకంటె మిక్కిలి కమలనయన
శ్రేష్ఠ మగుబుద్ధి యంచును జెప్పి తీవు
అయిన హింసానిమిత్తమై యమరు నెద్ది
యుద్ధకర్మంబు నియమింప యుక్త మగునె. 1

తే. గీ. సందియం బైనమాటలు చాలఁ జెప్పి
బుద్ధిచలనంబు గావింపఁబోలు నయ్య
కర్మ బుద్ధులలోపల ఘనతలంపు
శ్రేయ మెయ్యది నాతోడఁ జెప్పవయ్య. 2

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 3

తే. గీ. జ్ఞానయోగంబుచేతను సాంఖ్యపరులు
కర్మయోగంబుచేతను గర్మపరులు
సిద్ధి పొందుట నే మున్ను జెప్పినాఁడ
లోకమున రెండు నిష్ఠలు ప్రకటముగ. 4

తే. గీ. కర్మములు మానినంతనె కలుగు నెట్లు
జ్ఞానసంసిద్ధి నరునకు మానసీయ
ఆత్మసంసిద్ధి లేని సన్యాస మెట్లు
మోక్ష మియ్యంగ నేర్చును మోహదూర. 5

వ. వినుము ప్రకృతిజాతంబు లగుగుణంబులచేతఁ బ్రివర్తించు పురు

షుండు క్షణం బైనఁ గర్మంబు చేయకయుండ సమర్థుండు గాఁడు
గావున గుణవశుం డై కర్మంబులు చేయుచుండును. 6

తే. గీ. కడఁగి కర్మములం దెంతొ కట్టుపఱిచి
మనము బ్రహ్మంబునందును మలసినట్టి
విషయములయందు మరగించి వెలయువాని
డాంబికాచారుఁ గా మదిం దలఁచుమ య్య. 7

తే. గీ. ఎవ్వఁడేనియు నెప్డు జ్ఞానేంద్రియముల
మనముచేతను మిక్కిలి మట్టుపఱచి
ఆశ జెందక కర్మేంద్రియములచేత
సంచరింపుచు నుండు నా జనుఁడె యోగి. 8

తే. గీ. సహజకర్మంబు విడువక సలుపు మయ్య
కర్మ మొనరించుటే మేలు కర్మరహితుఁ
డై ప్రవర్తించుకంటెను దేహంబు నడుప
కర్మహీనునకు వశంబు గాదు వినుము. 9

తే. గీ. విష్ణుఁ గూర్చినకర్మంబు వెలిగ పార్థ
యితరకర్మంబు బంధకహేతు వగుట
విష్ణుఁ గూర్చినకర్మంబు విపులమతిని
ముక్తసంగుఁడ వై చేయు ముణుఁగుపఱక. 10

తే. గీ. యజ్ఞములతోడఁ బ్రజల తా నలరఁ జేసె
బ్రహ్మదేవుండు వారితోఁ బలికె ననఘ
యజ్ఞములు సేయుఁడీ మీర లతులమైన
ఫలము నిచ్చును గా మధుక్ప్రీతిమ నిది యె. 11

తే. గీ. దీనివల్లను దేవతల్ తృప్తి పొంది
దేవతావళి మీకును దృప్తిజేయు

నట్లు నన్యోన్యతృప్తుల నహరహంబు
పరఁగ శ్రేయోన్వయాప్తులఁ బడయఁగలరు. 12

తే. గీ. దేవతలు యజ్ఞములచేతఁ దృప్తిఁ బొంది
వృష్టిముఖమునఁ దృప్తిఁ గావింతు రట్టి
సౌఖ్యమును బొంది వారి కిష్టంబు లిడక
కుడుచువారలు దొంగలు కువలయమున. 13

తే. గీ. యజ్ఞశేషంబు భుజియించు యజ్ఞపరుఁడు
దోషములవల్ల దూరుఁడై తొలఁగియుండు
యజ్ఞశేషంబు గాని యాహారభోక్త
దుష్టతరకిల్బిషంబులఁ దొడరి కుడుచు. 14

తే. గీ. అన్నములచేతనే ప్రాణు లైనవారు
అన్నములు వృష్టివల్లనె యంకురించు
యజ్ఞములవల్ల వర్షంబు లడరి కురియు
యజ్ఞములు కర్మములవల్ల నలరఁ బుట్టు. 15

తే. గీ. కర్మములు బ్రహ్మవల్లనె కలిగెఁ గాదె
బ్రహ్మ యక్షరమందును బ్రభవమయ్యె
అక్షరబ్రహ్మ మన్నిట నధిగతంబు
గాన యజ్ఞంబునను నిత్యకలితుఁ డయ్యె.

తే. గీ. ఇట్లు వర్తించు చక్రంబు నెవ్వఁడేని
తెలియనొల్లక యొండొక తెరువునందు
నాతఁ డిపు డింద్రియారాము లడరుజీవి
చెడుటకై వానిబ్రతు కట్లు చెదరు భువిని.

తే. గీ. అనఘ యెవ్వఁ డ కర్ముఁడౌ నఘముఁ జెందఁ
డతని కాశ్రయణీయులు నరయ లేరు

దేవదానవవరులలోఁ దెల్లముగను
అతనిఁ దెలిసినయతఁడె బ్రహ్మజ్ఞుఁ డరయ. 18

తే. గీ. అతఁడు కర్మంబు చేసిన నర్థ మొదఁ
డతఁడు చేయకయుండిన నఘము జొదఁ
డతని కాశ్రియణీయులు నరయ లేరు
దేవదానవవరులలోఁ దెల్లముగను. 19

తే. గీ. కాన నక్తస్వభావంబు నూన కీవు
కార్యకర్మంబు సేయుము కలక బాసి
సక్తమతి గాక కర్మంబు సలుపు పురుషుఁ
డనఘ మోక్షపదప్రాప్తి నలరుచుండు. 20

వ. వినుము కర్మంబు జేసియెకాదె జనకాదులు జ్ఞానసిద్ధిఁ బొందుట,
నీవును స్వకీయం బైనక్షత్రియధర్మంబున మృతుండ వై స్వర్గంబు
నొందఁగల విదియె నీపరమధర్మం బైన వైష్ణవధర్మంబుచేత వినా
శంబు నొంద వనఘ. 21

వ. అనిన విని యర్జునుం డిట్లనియె. 22

తే. గీ. పాప మొల్లక చరియించు బ్రహ్మవిదుఁడు
నొక్కయెడఁ బాప మొనరించు నుర్విలోన
యిట్టి దుష్కర్మమునకును హేతు వెద్ది
వృష్ణికులవర్య చెప్పుమా వివరపడఁగ. 23

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 24

తే. గీ. ఎద్ది కామంబు క్రోధంబు నెన్న నదియె
నలర రాజసగుణమున సంకురించుఁ
బరమ బ్రహ్మరాశి కివల పాపరాశి
దాని శత్రుగా నీమదిఁ దలుపుమయ్య. 25

తే. గీ. అధికతరధూమ గప్పినయగ్ని వోలె
తలుచు మలినంబుచేత నద్దంబు వోలె
ప్రబల మగు మావిచేత గర్భంబు వోలె
ననఘ కామాన నజ్ఞానమావృతంబు. 26

తే. గీ వరతరజ్ఞానమునకు నావరణ మైన
కామ మెప్పుడు జ్ఞానికి కఠినవైరి
దాని నేమిటఁ బూరింప తరము గాదు
వినుము శోషంబు నొందించు ననలుమాడ్కి. 27

వ. మఱియుఁ గామంబు తన కధిష్ఠానం బగుమనోబుద్ధీంద్రియములచేత జ్ఞానసంపన్నుని జ్ఞానంబునకు నావరణంబై మోహ మొందించు.

తే. గీ కాన దద్మోహసంప్రాప్తి గాకమున్నె
యింద్రియమ్ముల నియమింపు మీవు పార్థ
జ్ఞానవిజ్ఞాననాశక మైనయట్టి
కలుషతర కామశత్రువుఁ గెలువఁగలవు. 29

తే. గీ. ఇంద్రియంబులు తనువున కెక్కు డనఘ
యింద్రియంబులకంటెను హెచ్చు మనము
మనముకంటెను సద్బుద్ధి మాన్య మరయ
బుద్ధికంటెను జీవుండు భూరితముఁడు. 30

తే. గీ. ఆత్మ బుద్ధికి కడు మెక్కు డని యెఱింగి
మనము యింద్రియములతోడ మగుడఁబట్టి
కామ మనెడుమరాస్పదకష్టరిపుని
గెలువు మర్జున బుద్ధిచేఁ గేవలముగ. 30

ద్య. ఇది ... ... ... ... ... ...

తృతీయాధ్యాయము.

శ్రీరస్తు.

# భగవద్గీత.

## చతుర్థాధ్యాయము.

### —జ్ఞానయోగము—

వ. శ్రీభగవంతుం డిట్లనియె.

క. ఈయోగము నే సూర్యున
కాయితమతిఁ జెప్పినాఁడ నాతఁడు మనుర్వ
ధీయుతునకుఁ జెప్పెను మను
డాయిక్ష్వాకునకుఁ జెప్పె నాశ్చర్యముగన్. 1

వ. పరంపరాప్రాప్తమైన యిమ్మహాయోగంబు నిమిప్రభృతు లైన
రాజపురుషు లెఱుంగుదురు, యిప్పు డది బహుకాలం బయ్యెఁ గా
వున నష్టంబై యున్నది 2

క. సారసహితునకు మును నే
నారూఢిగఁ జెప్పినట్టి యా యోగంబే
పోరాని సఖుఁడ వనుచును
జేరి రహస్యోత్తమంబుఁ జెప్పితిఁ జుమ్మీ. 3

వ. అనిన విని యర్జునుం డిట్లనియె. 4

క. హరి నీ జన్మముకంటెను
నరయంగా సూర్యజన్మ మంతకు మున్నే
పరికింప యోగ మెటువలెఁ
దిరముగఁ జెప్పితివి నాకుఁ దెలుపుము కృష్ణా. 5

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. జన్మములు నాకు లేవు. లోక
సంగ్రహార్థంబు కర్మంబు చేయుదును. 6

తే. గీ. శ్రేష్ఠు లగువార లెయ్యది సేయుచుందు
రనఘ యితరులు నాకర్మ మాచరించి
రట్టివా రెయ్యది ప్రమాణ మనితలంతు
రది ప్రమాణంబుగా లోక మనుసరించు. 7

తే. గీ. నాకుఁ గర్తవ్యలేశ మెన్నడును లేదు
పొందఁబడినది యే మీఁదఁ బొందుననుచు
మూఁడులోకంబు లందును ముఖ్యచరిత
యట్టిదైయుండు కర్మమే నాచరింతు 8

తే. గీ. కర్మముల నేనె చేయక కడపనైన
కర్మచయముల సేయమి గలుగు బ్రతుకు
అనఘ నామార్గ మంతయు ననుసరించి
యఖిలజనములు నడుతు రీయవనిలోన. 9

తే. గీ నేనె కర్మంబు సేయక నిలచియున్నఁ
గలుగు లోకంబునకు నాతో కర్మనష్టి
వర్ణసంకర మొదవించువాఁడ నేనె
యరుదు దానన లోకంబు హాని బొందు. 10

తే. గీ. సక్తుఁడై కర్మములు సేయు జనునిభంగి
యోగయుక్తుండు కర్మంబు లొనరఁజేయు
లోకసంగ్రహార్థమై లోకములను
దానసక్తత నొందక తనరి తాను. 11

తే. గీ. జ్ఞానరహితులకును జ్ఞానసహితులకును
బుద్ధిభేదంబులై యట్లు పూనియుండు
త్రిగుణకర్మంబుల నహంకృతయుతుండు
గాన మూఢాత్మ తాఁ గర్త గాఁ దలంచు. 12

తే. గీ. కడనుగల కర్మములకుఁ దాఁ గర్త గామి
తత్త్వసంస్మృతి యెప్పుడుఁ దలఁపుచుండు
ననఘ యింద్రియంబులు విషయంబులందు
సహారహాఁబుగ వర్తించు నని తలంచు. 13

తే. గీ. ప్రకటగుణములచేతను బద్ధులగుచుఁ
గర్మములు సేతు రెవార్ధుఁ గడఁగి వారి
యోగసంపన్నుఁ డైనట్టి యోగిజనుఁడు
నింద చేయఁడు కర్మముల్ నిక్కమనఘ. 14

తే. గీ. బ్రహ్మసంధానపరుఁడ వై భావమునను
గర్మములు నాకు నర్పణ గా నొనర్చి
యాస మమకారమును బాసి యనఘచరిత
యుద్ధ మొనరింపు సంతాప ముడుగు దీన. 15

తే. గీ. ఇదియె నామత మిందున నెవ్వ రేని
పాయకుండఁగ రద్దాని నసూయ లొదవ
నట్టిపురుషులు కర్మంబు లడరఁ ద్రోచి
ముక్తిఁ గాంతురు సంసారమోహ ముడిగి. 16

తే. గీ. శ్రద్ధ లేక యసూయచే జడత నొంది
యెవ్వఁడేనియు నీమత మెఱుఁగకుండు
నతఁడె విజ్ఞానమూఢుఁడై యహరహంబు
యోగమున నష్టుఁ డగునని యెఱుఁగవయ్య. 17

వ. వినుము పూర్వకర్మస్వభావంబు ననుసరించి జ్ఞానవంతుండు ప్రవర్తించు, నజ్ఞుఁడనఁగ నెంత, సకలభూతంబులును పూర్వకర్మస్వభావానుసారులు గావున నింద్రియనిగ్రహంబు వారల కేమిలీలంబు నిచ్చు. 18

తే. గీ. ఇంద్రియార్థంబు లందును నింద్రియముల
కనఘ రాగంబు ద్వేషంబు నంకురించు
రాగవిద్వేషములయందు తిలి మగప్పు
వలయునని మోక్షకాంక్షికి వైరు లరయ

వ. విధుము లెన్న నాయాసబడి నయంబైన పరధర్మంబుకం
యంబై హింసాదూషంబైన స్వధర్మంబు కొంచెమైనను
బది యొట్లన్నను.

తే. గీ. జన్మములు పెక్కు నాకును జరిగె వెరుక
జన్మములు పెక్కు నీకును జరిగె వెరుక
యన్నిజన్మంబు లన్నియు నెఱుఁగు దేను
నీ వెఱుఁగవు మాయచే నిక్కముగను.

తే. గీ. అజుఁడనయ్యును మఱియు నవ్యయుఁడనయ్యు
సర్వభూతములకు నేనె స్వామినయ్యు
అలరు నాత్మీయప్రకృతి నాశ్రయించి
మహి జనింపుదు నాదగు మాయచేత.

తే. గీ. ఎప్పుడెప్పుడు ధర్మంబు నేర్పు దప్పు
నెప్పుడెప్పు డధర్మంబు పెంచి చెలఁగు
నప్పుడప్పుడు నన్ను నే నవనిమీఁద
సంభవింపఁగఁ జైకొందు సాధువర్య.

తే. గీ. సాధుజనముల రక్షింప సత్వయుక్తి
దుర్జనావళిఁ దునుమాడ దోర్బలమున
ధర్మనిర్వాహకత్వంబు దగిలె నేని
సంభవింపుదు ప్రతియుగసమయమునను.

తే. గీ. నాదుజన్మంబు కర్మంబు నైష్ఠికతయు
నెవ్వఁడు దివ్యమటంచుఁ దా నెఱుఁగు నతఁడు

దేహానిర్గతుఁడై మఱి దేహములను
బొందకుండును వాఁడు నన్ బొందు ననఘ. 25

వ. వినుము వీతరాగభయక్రోధములను, మదేకచిత్తులును, మదుపాశ్రితులును, జ్ఞానతపస్సులచేత పవిత్రులయినవారలును, నన్నుఁ బొందుదురు. మద్భావంబు నొందినవారు పెక్కండ్రు గలరదియ య్యును, పీతవస్త్రంబును, శంకచక్రగదాశార్ఙ్గాదులును గలచతుర్భుజంబును గలిగి లక్ష్మీపతిత్వ సర్వవ్యాపకత్వంబులు వెలిగాఁ బ్రవర్తింతురు. 26

తే. గీ. ఎవ్వఁ డెటువలె నన్నుఁ బా నెఱిఁగికొల్చు
నట్టి పురుషుని నే నట్టు లనుసరింతు
సర్వదేవాత్మకుఁడఁ గాన సకలదేవ
పూజనంబులు నను వచ్చి పొందు పార్థ. 27

వ. ఈ లోకంబున కర్మసిద్ధి వేగంబె యగుటంజేసి సకలజనంబులు దాని నపేక్షించి కర్మసిద్ధిప్రదులైనదేవతల నారాధింతురు గాని మోక్షప్రదుం డగునన్ను సాక్షాత్కారంబున సేవింపనోపరు. మోక్షంబు చిరకాలసాధ్యంబు గాన. 28

తే. గీ. వర్ణముల నైన యుత్పత్తి వరుసజేసి
కర్మగుణములు విభజించి కరపినాడ
వాని కేఁ గర్తనయ్యును వరుసతోడ
అవ్యయస్థితి కర్త గా కలరుచుందు. 29

తే. గీ. కర్మములయందు లిప్తుండ గాను చేను
కర్మఫలములు నాకును గాంక్ష బుట్ట
యిట్లుగా న న్నెఱింగెడి యిద్ధజనులు
కర్మములచేత బద్ధులు గారు పార్థ. 30

తే. గీ. యోగి సహంకారయుక్తత్వమున నొనర్చు
కర్మముల్ బంధహేతువుగా నెఱింగి
పూర్వులైనముముక్షువుల్ పూనినట్టి
పుణ్యతరకర్మములు నీవు పొసఁగఁజేయు. 31

తే. గీ. కర్మ మెయ్యది కర్మము గాని దేది
యనుచు సుజ్ఞానులును మోహమునఁజరింతు
రేది తెలిసిన నశుభంబు లెల్లఁ బాయు
నట్టికర్మమును దెలిపెద ననఘ వినుము 32

వ. వినుము కర్మంబులను సమ్మిచేసిన స్వభావంబును చేయకుండిన
పాపంబు నగు, బ్రహ్మచారి గృహివానప్రస్థులం దుక్తంబులైన
స్నానాద్యనుష్ఠానంబులు వికర్మంబులును నవిచేసిన ఫలంబులును
చేయకుండిన ఫలరాహిత్యంబు నగు యజ్ఞదానాదులు అకర్మంబు
లును నవి యస్పృతిత్వంబున మోక్షంబులును, విశ్రుతినైన స్థాలి
త్యంబున ప్రత్యవాయంబును నగు సన్న్యాసంబులు వీను మిట్టివి
బ్రాహ్మణునకుఁ దెలియఁదగినవి గాన కర్మగతి గహనంబు. 33

సీ. వేదోక్తములచేత వెలసెడివారల
కర్మముల్ తన కవి గావటంచు
వేదోక్తములచేత వెలయంగ నొల్లని
అజగరజడభరతాదియోగి
వరులకర్మంబులు నరుస బాలోన్మత్త
పైశాచము లనఁ బరఁగునవియు
తనకుఁగర్మములుగా ధరియించి మదిలోన
వైష్ణవధ్యానంబు వదలకున్న

తే. గీ. అతఁడు సద్బుద్ధియుతులందు నధికతముఁడు
అతఁడు సత్కర్మచయములు యవనియందుఁ

జేయకున్నను జేసిన శిష్టతముఁడు
నతఁడె యోగివరేణ్యుండు నన ఘచరిత. 34

తే. గీ. కర్మములలోన నెప్పుడు గలిగియుండు
కామసంకల్పములచేత కడకుఁ ద్రోచి
జ్ఞాననిర్దగ్ధకర్ముఁ డైనవాఁడు
పండితుండని బుధులచేఁ బలుకఁబడును. 35

తే. గీ. కర్మఫలముల సంగతి గడకుఁ ద్రోచి
ఈశ్వరధ్యానసంతృప్తి నెసఁగఁ జెంది
యహరహంబు నిరాశ్రయుం డైన జనుఁడు
కర్మములు చేసి యైనఁ దాఁ గర్మిగాఁడు. 26

తే. గీ. ఆశ లుడిగిన కర్మయోగీశుఁ డనఘ
విగతసర్వపరిగ్రహుఁ డగుచు నుండి
దేహకృతకర్మములచేతఁ దిరిగెనేని
కర్మకిల్బిషలిప్తుఁడు గాఁడు పార్థ. 37

వ. కావున యదృచ్ఛాలాభసంతుష్టుండును సుఖదుఃఖకృత్యంబుల వల్ల నగు హర్షశోకంబుల నొందనివాఁడును, విగతమత్సరుండును, కోరికల సిద్ధ్యసిద్ధియెడ సమముగా వర్తించువాఁడును నగు మహాత్ముండు కర్మములు చేసిననేమి బద్ధుండు గాఁడు. 38

క. గతసంగుండును ముక్తుఁడు
మతిసుజ్ఞానస్థితుండు మానితయజ్ఞా
న్వితకర్ముఁడు, నిర్వాణో
న్నతియుక్తుఁడు కర్మి గాఁడు సవ్యవిచారా. 39

వ. ఇట్టి మహాయోగీశ్వరుం డది యర్పణంబందు బ్రహ్మంబును, హవిస్సులయందు బ్రహ్మంబును, అగ్నియందు బ్రహ్మంబును, హోమంబులయందు బ్రహ్మంబునుగా నిరీక్షించి, తనయందుఁగలుగు బ్రహ్మం

బును సర్వగతంబుగాఁ దెలిసి యీకర్మంబున బ్రహ్మనిర్వాహంబు నొందు. 40

తే. గీ. కర్మి యజ్ఞంబు దేవతాకలిత మగుచు
బ్రహ్మభావనశూన్య మై పరగుచుండు
యోగియజ్ఞంబు బ్రహ్మసంయుక్త మగుచు
బ్రహ్మభావనపూర్ణ మై పరగుచుండు. 41

వ. మఱియుఁ గొందఱు యోగసిద్ధిగల బ్రహ్మచర్యసంపన్నులింద్రియ నిగ్రహంబును, అగ్నియందుఁ గర్మేంద్రియ జ్ఞానేంద్రియములను నంతరంగచతుష్టయంబును వేల్తురు. మఱియుఁ గొందఱు యోగసంపన్నులయిన గృహస్థులు యింద్రియంబులను నగ్నులందు నాసక్తులై పరంపరములగు విషయంబుల వేల్తురు గాన యవియును యజ్ఞంబులందురు. 42

తే. గీ. గణుతికెక్కిన యింద్రియకర్మములను
ప్రాణకర్మంబులను స్వేచ్ఛ బారనీక
యీశ్వరధ్యాన మనువహ్ని నెసగ వేల్చు
యోగిజనులు హరిధ్యానయోగపరులు. 43

వ. మఱియుఁ గొందఱు కర్మయోగపరులు, ద్రవ్యదానంబులు చేయుటచే ద్రవ్యయజ్ఞంబనియును, కృచ్ఛ్రచాంద్రాయణోద్యాపవాసంబులను తపోయజ్ఞంబులనియును, చిత్తనిరోధంబు చేయుటచే యోగయజ్ఞంబనియును, చతుర్వేదంబులు చదువుటయు శిష్యులకుఁ జెప్పుటచే స్వాధ్యాయయజ్ఞం బనియును, వేదార్థంబులను, శాస్త్రంబులను నిరంతరంబు పరిశీలన చేయుటచే జ్ఞానయజ్ఞంబనియును వివేకించి ప్రయత్నంబున తీక్ష్ణవ్రతులై ప్రవర్తింతురు. 44

తే. గీ. నలినపానంబునందు ప్రాణంబు వేల్చి
పమ్మిప్రాణంబునందు పానమ్ము వేల్చి

ఉభయగతులు నిరోధించి యుండు రెపుడు
పరగ విను ప్రాణాయామపరులు పార్థ. 45

వ. మఱియుం గొందఱు నియతాహారులగు యోగీశ్వరులు జఠరగోళంబు చతుర్భాగంబుచేసి యందు రెండు భాగంబు లన్నంబుచేత నొక్క భాగంబు జలంబుచేతఁ బూరించి యొక్క భాగంబు వాయుసంచారమునకు రిత్తగా నిల్పి రేచక పూరక కుంభకముల ప్రాణాయామంబు జపించియు కుంభకంబున యింద్రియంబుల ప్రాణగతంబులుగా వేల్చి, రేచక పూరక గతుల నిరోధించుటయు యజ్ఞంబులయ్యె, నీద్వాదశయజ్ఞకర్తలు విగతకల్మషులు. 46

ఆ. వె. చెలగి యిట్టి యజ్ఞశేషసుధాంభోధి
బ్రహ్మపదమునందు బరగుచుండు
నిట్టిమఘము నెఱుఁగఁ డేనినైహికము లే
దితరలోకసుఖము లెల్ల గలుగ. 47

వ. ఇదియునుం గాక బహువిధంబులగు కర్మయజ్ఞంబులు వేదముల చేతఁ జెప్పఁబడియె, దీని బాధకములుగా నెఱిఁగితి వేని సంసారము వలన ముక్తుండై సుజ్ఞానసంపన్నుఁడ వగుదువు. 48

తే. గీ. ద్రవ్యమయ మైన యజ్ఞతంత్రంబుకంటె
జ్ఞానయజ్ఞంబు శ్రేష్ఠత జాల నొప్పు
సర్వకర్మంబులును ఫలసంయుతముగ
ననఘ జ్ఞానంబునందె సమాప్త మయ్యె. 49

తే. గీ. జ్ఞానసంపన్న హృదయ విజ్ఞానవిద్య
చందనప్రశ్న సేవల వలనుదనరి
నీకు నుపదేశ మిత్తురు నిజముగాను
దాని నెఱుఁగుము మిగుల తాత్పర్యమునను. 50

వ. కావున నిట్లు జ్ఞానసంపన్నుఁడవైతి వేని కఱిమ్మర మోహము నొంద కుండుదువు. మఱియు నీ భూతజాలంబులు నా యందు నెట్లుగలుగఁ జూతువు, నీ యందు నట్లు గలుగ వది యెట్లన్న నీ మహాదజ్ఞానం బునకు నేను సంతుష్టాంతరంగుండనై నిన్ను నా యంతటి వాఁడం జేయుదు. నీవును ప్రద్యుమ్నానిరుద్ధులఁ బోలె రుక్మిణి పతిత్వంబు వెలిగా నాదీయ సమ్ముఖంబునఁ బ్రవర్తింతువు. 51

ఆ. వె. పరమ మైనయట్టి పాపకర్మను కంటె
పాపి వైననేమి పార్థ నీవు
పాప మనెడి జలధి పారంబు గాంతువు
తెలిసి జ్ఞాన మనెడి తెప్పచేత. 52

తే. గీ. మహిత మగునింధనముల భస్మంబు చేయు
నగ్నిహోత్రుని మాడ్కిని యనఘ చరిత
జ్ఞాన వైశ్వానరుండు జేరి సంచితంబు
కర్మరాసుల భస్మంబుగా నొనర్చు. 53

వ. మున్ను చెప్పిన ద్వాదశయజ్ఞంబులందును జ్ఞానంబునకు సదృశం బైన పవిత్రంబు లేదు. తథాజ్ఞానంబు కర్మయోగంబున సిద్ధుం డగువాఁడు దెలియుఁగాని కర్మయోగరహితుండు దెలియలేఁడు. 54

తే. గీ. శ్రద్ధచే జ్ఞానసంసిద్ధి సంభవించు
నపుడె యింద్రియసంచార మణఁగిపోవు
జ్ఞానసంప్రాప్తివల్లను శాంతి బొందు
శీఘ్రకాలంబునందున చిరయశోర్థి. 55

తే. గీ. అజ్ఞునకు శ్రద్ధలేనట్టి యధమునకును
సంశయాత్మకునకు హాని సంభవింప
వీరిలోపల మిక్కిలి దూర మగును
సంశయాత్మకు యిహపరసౌఖ్య మనఘ. 56

తే. గీ. యోగి నస్యస్తకర్ముఁడై యొప్పువాని
జ్ఞానభక్త్యాఢ్య సంశయుఁడైనవాని
నాత్మవేత్తను కర్మంబు లనఘచరిత
కట్టిపరుపంగ నేరవు కర్మగామి. 57

క. కావున నజ్ఞానజనిత
భావంబును బొందినట్టి పటుసంశయముల్
కేవలము విజ్ఞానాగ్నిని
పోవంగా నడచి యుద్ధమునకున్ లెమ్మా. 58

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వాసుదేవ ధ్యానశాతురీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆప
స్తంబసూత్ర హరితసగోత్రి గాయమాంబాగర్భసం
జాత నాగోజీపండితపుత్రి దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునందుఁ
జతుర్థాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.



## పంచమాధ్యాయము.



### —♦ కర్మసన్యాస యోగము ♦—

వ. అనిన విని యర్జునుఁ డిట్లనియె. 1

క. సన్యాసము మును జెప్పి త
దన్యము నగు........బలికెదో
ధన్యాత్మ రెంటియందును
మాన్య శ్రేయంబు జెప్పుమా తెలియంగాన్. 2

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. విను మర్జున కర్మసన్యాసం
బగు యతిత్వంబును, గృహస్థకృత్యంబగు కర్మయోగంబును నీ
రెండును మోక్షకరంబగు, నిందులోపల కేవల సన్యాసంబుకంటె
కర్మయోగంబు విశిష్టంబు. 3

సీ. ద్వేషంబు తెంటార్చి తెలివొంద యోగిని
నిత్యసన్యాసిగా నీ వెఱుంగు
కాంక్ష యించుకైనఁ గలుగని యోగిని
నిత్యసన్యాసిగా నీ వెఱుంగు
సంసృతిద్వంద్వముల్ సమయించు యోగిని
నిత్యసన్యాసిగా నీ వెఱుంగు
నాయందు చిత్తంబు నాటిన యోగిని
నిత్యసన్యాసిగా నీ వెఱుంగు

తే. గీ. సుఖతరమ్మును నా యోగి జొనపు మదిని
బంధముక్తత నా యోగి బరగునను ము

యోగితతిలోన నాయోగి యుత్తముండు
కర్మయోగంబు గలిగిన ఘనుఁడు గాన. 4

తే. గీ. అనఘ సాంఖ్యంబు కర్మంబు నైక్యమనక
భిన్నమని మూఢబాలకు లన్న నేమి
యిందులోపల నొక్కటి యెఱిఁగె నేని
యుభయయోగఫలంబులు నొందవచ్చు. 5

తే. గీ. సాంఖ్యయుక్తుండు బొందు నేస్థానమది యె
యోగయుక్తుండు పొందును యుక్తముగను
సాంఖ్యమును గర్మయోగంబు సమతనొకటి
యనుమహాత్ముఁడు చూచిన యది యెచూపు. 6

క. కావున సన్న్యాసము స
ద్భావన యోగంబు లేక పలుదుఃఖంబౌ
పావనచరితా యోగపుఁ
బావనఁగిన యోగి మిగుల చంచల మొందున్. 7

వ. మఱియు యోగయుక్తుండునైన శుద్ధాత్ముండు శరీరంబు స్వాధీనముగాఁ గలవాఁడును జితేంద్రియుఁడును సర్వభూతంబులందును తనకాత్మగాఁగల పరమపురుషుండు తన కాత్మగాఁ జూచువాఁడును నైన యోగిపురుషుండు వేదోక్తంబైన యజ్ఞదానాది కర్మంబులు చేసిన తత్కర్మఫలబద్ధుండు గాఁడు గావున. 8

క. మహనీయ యోగసిద్ధుఁడు
విహితంబగు కర్మచయము నెస జేయుతఱిఁ
సహజంబు లనుచు వానిన
సహమికిఁ జేఁ జేసినాఁడటనుచు కిరీటీ. 9

వ. అది యెట్లన చూచుతఱి, వినునపుడు, స్పృశించు నెడ, నాఘ్రాణించు సమయంబున, కుడుచునట్టున, నడచు వేళల, నిద్రించు కాల

మున, నిట్టూర్పులు పుచ్చుతరువాత, పలుకుచో, విడుచుపట్ల,
గ్రహించునెడను, కనురెప్ప వేయుచోట, కనుమూయునవంతరమున,
నింద్రియములు స్వభావంబున విషయంబులందుఁ బ్రవర్తించునని
తాఁ గర్తగాకుండుట యోగీశ్వరుండు తలంచు. 10

తే. గీ. బ్రహ్మమందునఁ గర్మముల్ పరగ నిల్పి
సక్తమింతయు నొల్లని సరసుఁ డనఘ
పుణ్యపాపంబులందు లిప్తుండు గాఁడు
పద్మపత్రంబు జలములఁ బరగినట్లు. 11

తే. గీ. కాయమున బుద్ధి మనమున కర్మచయము
కేవలంబున నింద్రియక్రియలచేత
యోగిపురుషులు చేయుదు గురుతరముగ
సంగ మొల్లక చేతఃప్రసన్నతకును. 12

కం. యుక్తుండు కర్మఫలస్వాం
తక్తుండై శాంతిఁ బొందు తాత్పర్యమునన్
యుక్తేతరుఁడును గామాం
సక్తత ఫలబద్ధుఁ డగును సంగతకతనన్. 13

ఉ. సల్లలితంపుకర్మములు సాంద్రయశోనిధి సద్విరక్తిచే
నొల్లక సన్యసించి పటుయోగసుఖంబున నొందుచుండు దా
నెల్లెడ జీవుఁ డోలి కడు యేహ్యపుతొమ్మిదితూంట్ల మేనిలోఁ
మ్రిప్పుచు సేయనొల్లడు ప్రితోషముతో నియమింపుఁడన్యులన్. 14

వ. విను మీశ్వరుండు జీవలోకంబునకుఁ గర్తృత్వంబును, కర్మంబులును,
కర్మఫలంబులను సృజియించి యుండువాఁడు గాఁడు. కర్మవశంబున
ప్రవృత్తిస్వభావంబు గలిగిన దేహధారి కర్మంబులందు నియోగిం
ప్రుచుండు. 15

తే. గీ. ఒకని పాపంబు భుజియింప నొల్లఁ డీశుఁ
డొకని పుణ్యంబు భుజియింప నొల్లఁ డట్లు
పరగుసుజ్ఞాన మజ్ఞానబాధ మైన
మోహమందుదు రెఱుఁగని మూఢజనులు. 16

తే. గీ. ఆత్మతత్త్వపరిజ్ఞాన మడర హృదను
మను చరించిన యజ్ఞాన మణఁగఁ జేసి
బాధ మొదలించి శ్రీహరిఁ బరగఁ జూపు
తమము బాపియు తనుజూపు తరణిమాడ్కి.. 17

వ. అట్టి బ్రహ్మతత్త్వంబునందు నిశ్చయాత్మకబుద్ధియు, దానియందు
ప్రీతి యత్నంబాను తాత్పర్యంబును, అది శ్రేయం బాశ్రయంబు
గాఁగలుగుటయును, అది గలిగిన మహాత్ములు తత్ప్రసాదసిద్ధివలన
పాపరహితులై మోక్షంబు నొందుదురు. 18

తే. గీ. వినయవిద్యలు గలిగిన విప్రునందు
వినుతగోహస్తులందును విహగసమితి
శునకచండాలులం దుండఁ జూతు రెపుడు
పండితులు సమదృష్టిని బ్రహ్మ నవఘ. 19

వ. కావున సమతను బ్రహ్మావిర్భావంబు నొందుననియు, ధరిత్రిదేవుఁ
డుచితసర్గుఁడై యీవాసము జేరి విష్ణునందు వశించును. 20

క. పరమామోదము ఖేదము
బొరయక ప్రియ మప్రియంబు బొందక ఘనసు
స్థిరబుద్ధి విగతమోహుఁడు
పరమాత్మవిదుండు బ్రహ్మపద మందుఁ జుమీ. 21

ఆ. వె. వెలిసుఖంబులందు విగతేచ్ఛుఁడై మఱి
యాత్మసౌఖ్యమహిమ నలరు నెవ్వఁ

డతఁడు బ్రహ్మవేత్త యుతచిత్తుఁ డగుయోగి
అక్షయాతిసుఖము ననుభవించు. 22

తే. గీ ఎవ్వి యింద్రియవిషయముల నెసఁగఁబుట్టు
నట్టిసుఖములు దుఃఖంబు లందుచుండు
నవియు నాద్యంతవంతంబు లట్టుగాన
బుధుఁడు విషయజభోగముల్ వారయఁ డనఘ. 23

క. కామక్రోధోద్భవ మగు
పామరపుభోగ మెల్లఁ బ్రాజ్ఞుఁడునై దా
నేమరక విడుచు పురుషుం
డామనిగా మోక్షసౌఖ్య మందుఁ గిరీటీ. 23

సీ. ఎవ్వాఁడు గృహములో నెసఁగు దీపముమాడ్కి
దేహంబులోపలఁ దేజరిల్లు
హృదయపంకజవర్తి సిద్ధతేజఃపూర్ణు
నారాయణాఖ్యుని నవ్యమూర్తి
సుఖసాజ్ఞచేతను శోభిల్లులక్ష్మీశు
నతిశోభితాకారు నద్రిధీరు
బ్రహ్మాదివంద్యుని పరమాత్ము మోక్షదు
నానందమయుని శితాబ్జనయను

తే. గీ. చూచి యతనందు వికిలి సుఖమునొందు
నతనియందతియోగము లలరఁజేయు
నట్టిభక్తుండు బ్రహ్మంబు నధిగమించి
పొందు నవ్యయపదమును పురుషవృషభ. 25

వ. మఱియు క్షీణశమావాప్తులగు ఋషీశ్వరయోగీశ్వరాదిప్రపన్నులు
శ్రీవాసుదేవునికంటె ద్వితీయవస్తువు లేదని విచ్ఛిన్నసంశయులై

సర్వభూతహితరతులై, నియతచిత్తులై బ్రహ్మనిర్వాణంబు నొం
దుదురు. 26

క. కామక్రోధవిహీనులు
నేమము చిత్తమునఁ గల్గు నిర్మలయోగుల్
ధీమంతులు బ్రహ్మగులై
యామనగా ముక్తి గాంతు రందును నిందున్. 27

వ. మఱియు మోక్షపరుం డగుమునీశ్వరుండు బాహ్యేంద్రియభోగంబుల
బహిష్కరించి భ్రూమధ్యగతం బగుదృష్టిచేత బ్రహ్మావలోకనంబు
చేయుచుఁ బ్రాణాపానగతుల కుంభకరూపంబున నిరోధించి పర
మపదంబు నొందును. 28

క. ఇచ్ఛాక్రోధభయంబుల
స్వేచ్ఛాగతి నడువనీక యింద్రియసుఖముల్
తుచ్ఛమని విషయధీరుఁ
డచ్ఛిన్నత ముక్తిఁ గాంచు నాద్యంతంబున్. 29

సీ. యజ్ఞంబులకు భోక్త యగుదేవుఁ డెవ్వఁడు
తపముల కెవ్వని దైవ మంత్రు
సారిది జీవుల కెల్ల సుహృదుఁ డేదేవు
సర్వలోకములకు స్వామి యెవ్వఁ
డెవ్వఁడు సర్వజ్ఞుఁ డిందిరానాయకుఁ
డెవ్వని యంశాంశ మీజగంబు
బ్రహ్మాదివందిత పదపద్ముఁ డెవ్వఁడు
భువనజాలములందుఁ బూర్ణుఁ డెవ్వఁ

తే. గీ. డిట్టిలోకంబులకు నెల్ల సిద్ధచరితుఁ
డెవ్వఁ డాచ్ఛాదనంబయ్యె నింతటికిని

యట్టిమహనీయతరమూర్తి నాత్మలోన
నెఱిఁగి మోక్షంబు నొందు యోగీశ్వరుండు. 30

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వ్యాసదేవ ద్వాదశాక్షరీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆప
స్తంబసూత్ర హరితసగోత్ర గాయనూంబాగర్భసం
జాత నాగోజీపండితపుత్ర దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునందుఁ
బంచమాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.

## షష్ఠాధ్యాయము.

### ఆత్మసంయమయోగము.

వ. శ్రీభగవంతుం డిట్లనియె.

మ. అనఘాత్మాగతసర్వకర్మఫలుఁడై యచ్ఛిన్నయోగంబుతో
ననయంబుం గరణీయకర్మనిచయం బర్హంబుగాఁ జేయు నా
వినుతాచారుఁడు కర్మి యైనఁ బరగుం విఖ్యాతసన్యాసియై
వినుమా యోగము దాస్యమున్ విడుచు నా విప్రుండు సన్యాసియో.

తే. గీ. ఎద్ది సన్యాసమని భూమి నెన్నఁబడియె
నదియె యోగంబుగాఁ జూడు మార్యవృషభ
సకలసంకల్పసన్యాసశాలి గాక
యోగి గానేరఁ డాతఁడు యోధవర్య. 3

వ. హృదయంబున ధ్యానంబుచేత వాసుదేవసాక్షాత్కారంబు నపేక్షిం
పుము. ఈశ్వరునకు వేదోక్తకర్మంబులు చేయవలయు, హృదయం
బందు నతని సాక్షాత్కారంబు గలిగిన యోగీంద్రునకు కర్మోప
శాంతి వలయు. 4

తే. గీ. ఎప్పుడెప్పుడు విషయభోగేచ్ఛ మాను
నెప్పుడెప్పుడు కర్మంబు వెడలఁజేయు
నప్పుడే యోగధీరుఁడై యలరుచుండు
సర్వసంకల్పములతోడి జాగు మాని. 5

వ. మఱియు పురుషుండు వివేకయుక్తంబగు చిత్తంబుచేత జీవుని నుద్ధరిం
పఁదగుగాని యధోగతిఁ బడఁద్రోయందగదు. అనియెట్లన్న చిత్తంబు

దుర్విషయంబులఁ బ్రవర్తింప తనుతోడఁగూడ జీవుని ముక్కుద్రాడి
పసరంబునీడ్చిన చందంబున నీడ్చుకొనిపోయి నరకంబు నొందించుఁ
గావున నసత్కర్మంబులచే జీవునిబద్ధునింజేయు గావున మఱియు జీవుఁ
డు చిత్తంబుచే బద్ధుఁడై వర్తించు నది యెట్లన్న నది సుకర్మకర్తయై
జీవునికిమోక్షంబుసంపాదించుఁ గావున జీవునికి చిత్తంబె శత్రు
వయ్యె నదియెట్లన్న తా దుష్కర్మవర్తియై పుణ్యలోకంబులకు జీవు
నిం దూరునిగాఁ జేయుఁ గాన. 6

క. జీవునకు మనము బంధుఁడు
జీవునిచే మానసంబు జితమైనతఱిఁ
జీవునకు మనము శత్రుఁడు
జీవుఁడెగా మానసంబు జితపడనితఱిఁ. 7

తే. గీ. జ్ఞానవిజ్ఞానసంపూర్ణమానసుండు
స్వర్ణమృత్పిండపాషాణ సదృశబుద్ధి
నలరుజీవుఁడు విజితేంద్రియత్వశాలి
యోగియని బుధు లెన్నంగ నొప్పుచుండు 8

తే. గీ. బంధుమిత్రులయందును పాపపుణ్యు
లం దుదాసీనమధ్యస్థులందు సరిసు
హృత్తులందును సమత వర్తించువాఁడు
యోగులందు విశిష్టుఁడై యొప్పుచుండు. 9

వ. యోగీశ్వరుండు నిరంతరంబును సమాధియుక్తుండును నై ప్రవర్తిం
పుచుండు. 10

తే. గీ. శుద్ధ మగు దేశమునఁ గుశస్తోమ మునిచి
దానిపై యజినంబుంచి దానిమీఁద
వస్త్రమిడి యాసనము చేయ వలయు మిగుల
హెడవు నీచంబు గాకుండు పురుషవర్య. 11

వ. అట్టియాసనమునందుఁ బ్రవేశించి మనము నింద్రియముల మట్టుపరచి యిట్టియాత్మసిద్ధి కేకాగ్రచిత్తుఁడై యోగ మభ్యసింపుచుఁ గాయ శిరోగ్రీవంబుల మూలాధారంబుల మొదలుకొని శిరఃపర్యంతం బుగా సమత్వంబు నిలుపుచు స్థిరచిత్తుఁడై చలింపక బ్రహ్మధ్యాన పరుఁడై నాసికాగ్రబద్ధనిమీలితనేత్రంబులఁ జూచుచు దిక్కులు చూడకుండవలయు. 12

సీ. ఘనశాంత మాత్మలోఁ గలిగి బ్రహ్మమునందు
యుక్తుఁడై యోగి దా నుండవలయు
భయ మింతయును లేక బ్రహ్మంబునందును
యుక్తుఁడై యోగి దా నుండవలయు
బ్రహ్మచర్యవ్రతపరత బ్రహ్మమునందు
యుక్తుఁడై యోగి దా నుండవలయు
మనముచంచలమెల్ల మాన్పి బ్రహ్మమునందు
యుక్తుఁడై యోగి దా నుండవలయు

తే. గీ. యోగి నాయందు మది నిల్పి యుండవలయు
యోగి మత్పరబుద్ధితో నుండవలయు
యోగి యోగంబు నేమరకుండవలయు
విజయ సంగ్రామసంభృతవిమతవిజయ. 13

తే. గీ. ఎపుడు చిత్తంబు పరమాత్మ నెనఁగఁగూర్చి
నియతమానసవృత్తిచే నిలచియుండి
నేఁ బ్రవర్తించు నిర్వాణనిలయమునను
యోగి వర్తించు సంసృతిత్యాగి యగుచు. 14

క. కేవల బహ్వాశనునకిని
కేవలము నిశాచరునుని కేవల నిమస్రి

కేవల జాగరశీలును
బాలింపఁగ యోగమెల్లఁ బ్రాపించు భువిన్. 15

తే. గీ. తగిన యాహారవిహారణతత్పరతను
తగిన జాగరనిద్రలఁ దగినయట్టి
కర్మచేష్టల వర్తింపఁ గలుగువాని
యోగమంమను దుఃఖంబు నొందకుండు. 16

తే. గీ. ఎపుడు భయయుతమానసం బీగు నందు
నుపగతంబయ్యు విస్ఫూర్తి నొందుచుండు
నెపుడు కామంబులం దెల్ల యిచ్ఛ మాను
నపుడె యోగప్రయుక్తుఁడై యలరుచుండు. 17

తే. గీ. వాతరహితమగును వర్తిల్లు గేహంబు
నందు వెలుగుదీప మట్ల నరయ
నియతచిత్తుఁ డగుచు నిర్మలాత్మకుఁ డైన
యోగయుక్తపురుషుఁ డొప్పుచుండు. 18

తే. గీ. ఎందు చిత్తంబు స్వాధీనవృత్తి నుండు
యోగసేవను బ్రహ్మసంయుక్త మగుచు
నెందు చిత్తంబుచే బ్రహ్మ మెసగఁ జూచు
నధికసంతుష్టుఁడై పరమాత్మయుండు. 19

తే గీ. బుద్ధిచేత గ్రహింపక బోలునట్టి
యింద్రియాతీత మగుసౌఖ్య మెసగునెందు
నందు వర్తించి చలనంబు నొందకుండు
నాత్మతత్వపరిజ్ఞాన మాలవరించి. 20

తే. గీ. అరయ నే లాభ మొందిన నంతకంటె
లాభ మధికంబు లేమి దలంపఁబడును

చిత్త మొంచును లగ్నంబు చేసినప్పుడు
శీతవాతాదిదుఃఖముల్ చెందకుండు. 21

తే. గీ. ఎందు దుఃఖపరప్రాప్తి నెసఁగకుండు
నదియె యోగంబుగా నీవు మది నెఱుంగు
మట్టియోగంబు నిశ్చలితాత్మ వగుచు
నభ్యసింపుము మహితప్రయత్నమునను. 22

తే. గీ. సర్వసంకల్పములవల్ల సంభవించు
సర్వకామములను ద్రోచి సంతతంబు
మనముచే యింద్రియంబుల మగుడఁబెట్టి
యోగ మభ్యాస మొనరింపుచుండవలయు. 23

తే. గీ. బుద్ధిచేతను ధైర్యంబు పొసఁగఁ బట్టి
మెల్లమెల్లనె యోగంబు మొలఁగఁజేసి
యాత్మసంస్థముగా మన మలవరించి
చింత మదిలోన నేమియుఁ జేయవలదు. 24

తే. గీ. చంచలస్ఫూర్తి వర్తిల్లు చపలచిత్త
మెప్పుడెప్పుడు యితరేచ్ఛ నెసఁగుచిత్త
మెప్పుడెప్పుడు చలనమై యేపువచ్చు
నప్పుడప్పుడె పోనీక యణఁగఁబట్టి. 25

వ. మఱియు నట్టి చిత్తంబు నాత్మవశంబుగాఁ జేయునట్టి యతఁడే యోగి యనఁ బరఁగు. 26

తే. గీ. శాంతచిత్తుని వీతరజస్కు మిగుల
బ్రహ్మభావనపరుఁడైన ప్రాజ్ఞితముని
విగతకల్మషు నత్యంతవిమలచరిత్రు
నుత్తమం బగుపరసౌఖ్య మొందు పార్థ. 27

వ. నిరంతరంబు పరమాత్మయందు మనంబుఁ జేర్చి విగతకల్మషుండై
వర్తించు యోగీశ్వరుం డనాయాసముననే బ్రహ్మసాక్షాత్కార
జన్యసుఖం బనుభవించును. 28

తే. గీ. సర్వభూతస్థుగా నన్నుఁ జర్చఁజేయు
సర్వ మెప్పుడు నాయందు జరగఁజూచు
యోగయుక్తాత్ముఁ డైనట్టి యుత్తముండు
సర్వభూతములందును సమదృశుండు. 29

తే. గీ. సర్వవిశ్వంబు నాయందు సమతఁగాంచు
సర్వవిశ్వంబులో నన్ను సమతఁజూచు
నతని కెప్పుడు నే నదృశ్యత వహింప
నతని నాలోనఁ గృపచేత నలరఁజూతు. 30

వ. మఱియు సర్వభూతస్థితుండగు నన్ను నన్యదేవతాభజనంబు వర్జించి
పరబ్రహ్మంబుగా నేకత్వబుద్ధిని భజించు యోగీశ్వరుండు సత్కర్మ
ములందు వర్తించె నేమి వర్తింపకుండె నేమి, నాయందు వర్తించు
ఘనుఁడు. 3

ఆ. వె. తొడరినట్టి సౌఖ్యదుఃఖముల్ తన కెట్టు
లట్ల గాదె పరుల కనుచుఁ దలఁచి
సకలజంతుదేహచయమున దేహము
నొనరు నల్లఁజూచు యోగయుతుఁడు.

వ. అనినవిని యర్జునుం డిట్లనియె. మధుసూదనా నీచేతఁ జెప్పఁబ
డు యోగంబు హృదయంబున స్థిరంబుచేయ శక్యంబుగాదు. అది యెట్ల
చిత్తము చంచలస్వభావము గలది గాన.

తే. గీ. అంగసంక్షోభబలవంత మధికదృఢము
చంచలంబు గదా మానసంబు కృష్ణ

దీని నిగ్రహాకర్మంబు పూనరాదు
గాలి మూటయుఁగట్ట శక్యంబు గాదు. 34

వ. అనినవిని శ్రీభగవంతుం డిట్లనియె. 35

తే. గీ. సంశయము లేదు పార్థ నిశ్చంక మేలు
దుర్లభపుచిత్తచలనము ద్రోచిపుచ్చు
పరిబలవైరాగ్యమహిమ నభ్యాసమునను
మనము గుదియింపవచ్చు సాధనముచేసి. 36

తే. గీ. నియతచిత్తుండు గాఁడేని నీచమతికి
బొందరాకుండు యోగంబు పుడమిలోన
నియతచిత్తుండె యోగంబు నిర్వహింప
శక్తుఁ డగు నిర్మలోపాయసౌష్ఠవమున. 37

వ. అనినవిని యర్జునుం డిట్లనియె 38

తే. గీ. శ్రద్ధతోఁగూడ యోగంబు సంగ్రహించి
మనము యోగంబువల్లను మగిడెనేని
విగళితాభ్యాసుఁ డైనను విమలయోగ
సిద్ధి లేకను వా డెందుఁ జెందు కృష్ణ. 39

వ. మఱియు సామాన్యపురుషుండు కొంతకాలము కర్మములు చేసి వాసు దేవార్పణంబు చేసినకతంబున, స్వర్గదూరుండును, కర్మంబులు సేయక సన్యాసియై అభ్యాసవైరాగ్యశూన్యుఁడై యోగభ్రష్టుం డైనకతంబు న మోక్షదూరుండునై యుభయమార్గంబులఁ బ్రతిష్ఠ లేక మూఢుం డై పరిచ్ఛిన్నంబైన మేఘంబు దానివల్లంబాసి మేఘాంతరంబు బొం దక నడుమనె నాశంబునొందిన చందమున నట్లాధ్రిమంబు నొంద కుండుఁ గాన. 40

తే. గీ. ఈమహాసంశయము నాకు నేర్పరించి
తెలుపుటకు నీవె కాని యో దేవదేవ

నీకు మిక్కిలి యెవ్వారి నేనెఱుఁగ
చిరతరాశేషసంశయచ్ఛేత్త వీవు. 41

వ. అనినవిని శ్రీభగవంతుం డిట్లనియె. తండ్రి అర్జున నీవుచెప్పిన సామాన్యయోగికి యిహలోకంబున పరలోకంబున భ్రష్టత్వంబు లేదు. పుణ్యకర్మంబుచేసినవాఁడొకానొకఁడును నరకంబునొందకుండుఁగాన.

తే. గీ. పుణ్యకర్మల లోకముల్ బొందు సుఖము
శాశ్వతం బగువర్షముల్ సలుపు నిచట
యోగమున భ్రష్టుఁడైనట్టి యోగి మగిడి
శుద్ధసాత్వికగృహముల సొరిది బుట్టు. 43

తే. గీ. ఇట్లు గాదేని ధీయుక్తి నెసఁగునట్టి 44
యోగివర్యుల కులములో నుద్భవించు
నిట్టిజన్మంబు దుర్లభం బెవరికైన
యోగులకె గాని భువిలోన యోధవర్య. 44

తే. గీ. భద్రయోగికి మాకలు భవమునందు
పార్థ దేహికయోగంబు ప్రబలమొందు
మహితుఁడై యోగసంసిద్ధి మరలిమరలి
మారుదేహంబులందును మసలుచుండు. 45

తే. గీ. పౌర్వికాభ్యాసమున సిద్ధి పడయలేక
యతిశయంబగు నవశత నందెనేని
బ్రహ్మజిజ్ఞాసుఁడై చాల బరఁగుఁగాని
కర్మచయములచేత తాఁ గట్టువడడు. 46

తే. గీ. యత్నమున యోగసంగ్రహ మలరఁజేసి
దోషములఁ బాసి సంసిద్ధి దొడరువాఁడు

పెక్కుజన్మంబులందైన పెనగిపెనగి
వెనక నిర్వాణపదమున వెలయకున్నె. 47

తే. గీ. తపసికంటెను యోగియే ధన్యతరుఁడు
జ్ఞానికంటెను యోగి సన్మానయుతుఁడు
కర్మికంటెను యోగియే గౌరవుండు
గాన నీవును యోగివి గమ్ము పార్థ. 48

తే. గీ. సర్వమైనట్టి యోగీశచయమునందు
నంతరాత్మయి నా మది నలరనిల్పి
శ్రద్ధచేతను నాసేవ సలుపునతఁడు
సలితయోగోత్తముఁడు నాకు సమ్మతుండు. 49

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వ్యాసదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు వరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆప స్తంబసూత్ర హారితసగోత్రి గాయమాంబాగర్భసం జాత నాగోజీపండితపుత్రి దత్తోజీపండిత ప్రణీతం బైన భగవద్గీతాశాస్త్రంబునందు

షష్ఠాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.

## సప్తమాధ్యాయము.

### —జ్ఞానయోగము.—

వ. శ్రీ భగవంతుం డిట్లనియె.

తే. గీ. నన్ను నెఱిఁగెడి జ్ఞానంబు నాదు యోగ
మనఘ నాయందు చిత్తంబు నలరియుంట
నన్ను మది నాశ్రయించుట నరుఁడ నీకుఁ
జెప్పెదను సంశయం బింత చెందకుండ.

తే. గీ. జ్ఞానమనుదాని విజ్ఞానసహితముగను
విమలమతి నీకుఁ జెప్పెద విస్తరించి
యెద్ది యెఱిఁగినఁ గ్రిమ్మర యెఱుఁగఁదగిన
యర్థమేమియు లేకుండునట్టిదాని.

తే. గీ. వెలయ సంఖ్యలలోపల వెదకిచూడ
చిత్తనియతికి యత్నంబు సేయు నొకఁడు
వీరి పెక్కండ్రిలోపల వెదకిచూడ
గట్టిగా నన్నెఱింగెడి ఘనుఁ డొకండు.

తే. గీ. అవని జలమును, వాయువు, నాకసంబు
అగ్నియును, బుద్ధి, చిత్త మహంకరణము
ననఁగ నెనిమిది భేదంబులయ్యె నాదు
ప్రకృతి యిరువదినాలుగై పరగునదియు.

వ. ఈ చతుర్వింశతితత్త్వాత్మకంబగు ప్రకృతికంటెఁ బరమైన జీవప్ర
కృతి గలదు. దానిచే నీ జగంబు సచైతన్యాకృతంబై ప్రవర్తిల్లు. 6

తే. గీ ఇట్టి ప్రకృతులు రెండును హేతువులుగ
పరిభవ మొందెను భూతవర్గంబు దెలియు
మెలమి బుట్టించుటకు దాని మెలపుటకును
కారణము నేనె సందేహాకలను వలదు. 7

తే. గీ. నేనె కర్తను నాకంటె నేత యొకఁడు
పార్థ యీ విశ్వసృష్టికిఁ బరగ లేదు
గుచ్ఛవిశ్వంబు నాయందుఁ గూడియుండు
మణులు సూత్రంబునందును మలసినట్లు. 8

వ. మఱియు జలంబులయందలి రసంబును, సూర్య చంద్రులందలి ప్రభ
యును, వేదంబులందలి ప్రణవంబును, ఆకాశమందలి శబ్దంబును,
పురుషుల యందలి పౌరుష్యంబును గ్రమంబున నేనకా నెఱుంగుము.

తే. గీ. భూమియందలి సౌగంధ్యభూతి యేనె
అగ్నియందలి కాంతియు నలర నేనె
దేహధారుల జీవనస్థితియు నేనె
తపసులందలి యుత్కృష్టతపము నేనె. 10

తే. గీ. బుద్ధిమంతుల యందలి బుద్ధి నేనె
తీవ్రతేజులయందలి తేజ మేనె
నిఖిలభూతంబులకు నెల్ల నిత్యమైన
బీజమును నేనె తెలియుము పృథులశౌర్య. 11

తే. గీ. కామరాగాదివర్జనకలిత మైన
సత్వసంపన్నునందలి సత్వ మేను
ధర్మహానికిఁ దలఁకెడు ధర్మ మైన
కామ మసఘాత్మ నేనె కాఁ గనుము మదిని. 12

వ. మఱియును సాత్వికంబును, రాజసంబును, తామసంబును నాచేత
నుత్పన్నంబయ్యె, నట్టి సత్వరజస్తమోగుణంబులు నా యధీనంబై
వర్తించుఁ గాని నేను జీవునింబలె వాని కధీనుండఁ గాను. 13

తే. గీ. మూఁడుగుణములచేతను మోఁసి విశ్వ
మఖిలమును మోహితంబునై యలరుచుండు
నవ్యయుం డనుగుణముల కన్యతముఁడ
నైన ననుఁ గాన లేరు మోహమునఁ జేసి. 14

తే. గీ. దేవకృతమై జగంబులోఁ దేజరిల్లు
మాయ త్రిగుణాత్మకం బది మామకంబు
దాఁటుటకు దుస్తరము దాని దాఁటువాఁడు
నాకు భక్తుఁడై జలనిధి నావ వోలె. 15

తే. గీ. దోషకారులు, మూఢులు, దుష్టజనులు
దైత్యభావసమాశ్రితుల్ దర్పయుతులు
నాప్రవృత్తికి లోనుగా నడువ రనఘ
మాయనపహృతవిజ్ఞానమతులు గాన. 16

తే. గీ. కొంద ఱార్తత నన్నును గొలుచువారు
కొంద ఱధ్యాత్మవిద్యకై గొలుచువారు
కొంద ఱర్థార్థిచిత్తులై కొల్తు రనఘ
జ్ఞానులై ననుఁ గొల్తురు నాల్గుగతుల. 17

తే. గీ. వీరిలోపల సుజ్ఞాని వెలయ ఘనుఁడు
భక్తియోగంబు మదిఁ గల్గు భద్రమూర్తి
వాని కేను ప్రియుండను వాఁడు నాకు
ప్రియుఁడు మిక్కిలి భక్తిచేఁ బెంపుగాను. 18

వ. మఱియు నార్తుఁడై నన్ను భజించువాఁడును, జిజ్ఞాసుండై భజించు
వాఁడును, అర్థార్థి యై భజించువాఁడును, మోక్షార్థియై విశేషించి

యు, ననపేక్షుండైన జ్ఞాని మదీయ శరీరంబు మాఁడ్కి మత్స్థి
యుండై, యుత్తమగతుండై నన్నుఁ బొందు. 19

తే. గీ. పెక్కు జన్మంబులందును బేర్చిపేర్చి
భక్తియోగంబు నువిపంట బండ జేసి
అఖిలజగములు హరిమయం బనుచుఁ గాంచు
నామహాత్ముఁడు దుర్లభుం డనఘచరిత. 20

తే. గీ. కామములచేత జ్ఞానభంగంబు నొంది
యన్యదేవానురక్తులై యలరుచుండు
రాదిజన్మంబు నందువా రట్టివారె
కాన తద్దేవభక్తియె గలిగియుండు. 21

తే. గీ. ఎవ్వరెవ్వరే దేవు నెలమిఁగొల్తు
రధికతరమైన శ్రద్ధచే నట్టివారి
శ్రద్ధ తద్దేవతలయందె జరగ జేయు
తలచ దేవతలెల్ల నాకళలు గాన. 22

తే. గీ. శ్రద్ధచేతను లెస్సగా జరపినట్టి
దేవతారాధనముచేతఁ దృప్తినొంది
వారలకు చాలఫల మిచ్చువాఁడ నేనె
దనరదైవతములు నాదు తనువు గాన. 23

తే. గీ. అంత తద్దేవజాలంబు నధిగమించి
యల్పమేధస్సు లగువార లలఘుచరిత
దేవతులఁ బొందుదురు సుమ్మి దేవయాజు
లనఘ మద్భక్తిపరుఁడు నన్నధిగమించు. 24

వ. మఱియు బుద్ధిహీనుం డగుదురాత్ముండు తన భావంబునను పరబ్ర
హ్మంబనియును, నవ్యయుండనియును, అత్యంతోత్తమోత్తముండని
యున్న నెఱుఁగఁజాలక రామకృష్ణాద్యవతారంబుల దేహధార్య

తంత్రింబగు దేవతాంతరం బా గాఁ దలఁచు 25

తే. గీ. అజుఁడ నవ్యయమూర్తినై యలరు నేను
యోగమాయాకృతుండనై యొరులచేతఁ
జూడఁబడకుండు మూఢుండు శూన్యహృదయుఁ
డనఘ మిక్కిలి నన్ను లో నరయ లేడు. 26

తే. గీ. తొల్లి చనిపోయినట్టి జంతువుల కెల్ల
వర్తమానంబు లగువాని వచ్చువాని
నేనెఱుఁగుదు గాని నన్నెట్టి జంతు
వైన నెఱుఁగంగ లేదు మాయాబలమున. 27

తే. గీ. కాంక్షచే ద్వేషబుద్ధియు గలుగునట్టి
ద్వంద్వమోహంబుచేఁ గాదె తెలుచుగాఁగ
జన్మమరణాదిసుఖదుఃఖ సంకులంపు
స్వర్గమును బొం దఁ జొ చ్చును జంతుచయము. 28

తే. గీ. పుణ్యకర్మము పాపంబు బొలయఁజేసి
ద్వంద్వమోహంబు తనలోనఁ దగులనీక
దృఢతరమతియుక్తులై దినదినంబు
భజన మొనరింపుదురు నన్ను భక్తపరులు. 2

వ. మఱియు జరామరణంబులగుటకై నన్నాశ్రియించిన నియతచిత్తుల
జ్ఞానయోగులను, కర్మయోగులనుగా నెఱుఁగుము. 3

తే. గీ. అధిభూతాదిదైవంబు నాదియజ్ఞ
మనుచు నన్ను నెఱుంగు నయ్యార్యతముఁడు
మరణకాలంబునను నన్ను మఱువకుండు
యోగయుక్తుండె భక్తియోగోత్తముండు.

గద్య. ఇది ... ... ... ... ...

సప్తమాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.

## అష్టమాధ్యాయము.

### అక్షర పరబ్రహ్మయోగము.

వ. అనిన విని యర్జునుం డిట్లనియె. 1

తే. గీ. బ్రహ్మ మెయ్యది యధ్యాత్మభావ మెద్ది
కర్మ మెయ్యది పలుకుమా కమలనయన
కృష్ణ యధిభూత మెయ్యది కేవలముగ
దేవ యధిదైవ మనునెద్ది తెలుపవలయు. 2

వ. మఱియు శరీరమునందు అధి యజ్ఞంబన నెయ్యదియై ప్రవర్తిల్లుఁ బ్ర
యాణకాలంబున నియతచిత్తులైన మహాత్ములచేత నెట్లు తెలియం
బడుదువు, తెలుపవే యని యడిగిన శ్రీభగవంతుం డిట్లనియె. 3

తే. గీ. అక్షరంబు పరబ్రహ్మ మనఘ పురుష
జీవుఁ డధ్యాత్మమను పేరఁ జెప్పఁబడును
భూతములు సేయు యత్నముల్ పుణ్యచరిత
కర్మనామంబుచేఁ బలుకంగఁబడును. 4

తే. గీ. దేహ మధిభూతమను పేరఁ దేజరిల్లు
పురుషు డధిదైవతంబునఁ బొలుపుమిగులు
ననఘ యధియజ్ఞమను పేర నలరువాఁడ
నేనె దేహంబులందును నిజము సుమ్ము. 5

తే. గీ. అనఘ యంత్యంబునందు నన్ననుసరించి
దేహమును బాసిపోయెడి దేహి యెవుడు

బ్రహ్మ మగు నాదు భావంబు పరగఁ జెందు
సంశయము లేదు దీనికి సవ్యసాచి. 6

తే. గీ. వెలయ దేహంబు వీడు నవ్వేళ ననఘ
భావితంబై తలంపున బారు నెద్ది
యాశరీరంబె సంప్రాప్తమగును దాన
తొలుత మద్భావకుం డైన తోఁచిచనను. 7

వ. మఱియు సర్వకాలంబులందును, యుద్ధంబునందును నన్నే తలపోయు చుండుము, యన్యముడిగి, నాయందు మనోబుద్ధులు దగులంబు జేసి యోగయుక్తిచుండి తేని నన్నుఁ జెందెదవు సంశయంబు లేదు. 8

తే. గీ. అనఘ యభ్యాసయోగంబు నధిగమించి
చిత్తమన్యంబు మీఁదను జెందనీక
పరమపురుషుని దలపోయు పావనుండు
బ్రహ్మమును జెంది యెన్నఁడుఁ బాయకుండు. 9

వ. మఱియు సర్వజ్ఞుండును, పురాణపురుషుండును, శాసించువాఁడను అణువుకంటె అణువును, సర్వంబునకుఁ బోషకుండ, నచింత్యరూపుండ, నాదిత్యవర్ణుండ, తమోదూరుండను నైననన్ను స్మరించువాఁడు.

తే. గీ. మరణదశయందు నామీఁద మనసు నిల్పి
విమలతరభక్తియుక్తుఁడై బొమలనడుమ
ప్రాణమును జేర్చి మృత్యువు బారిఁ బొంది
బ్రహ్మమగు దివ్యపురుషుని బడయు నన్ను. 11

తే. గీ. వేదవిదు లక్షరం బన వెలయునెద్ది
యతిజనంబులు వసియింప నలరు నెద్ది
యెద్ది గాంక్షింతు రధ్యాత్మ నెఱుఁగువారు
తత్పదంబును జెప్పెదఁ దనర వినుము. 12

తే. గీ. సర్వదేహాస్తరంధ్రముల్ సంయమించి
మనము హృదయస్థమునందును మరగఁజేసి
ప్రాణమును బ్రహ్మరంధ్రముఁ బరగఁజేర్చి
యోగధారణ మొందును యోగి యగుచు. 13

తే. గీ. బ్రహ్మ మేకాక్షరంబైన ప్రణవమంత్ర
ముచ్చరించుచు నామూర్తి నొనరఁజూచు
అంత దేహంబు విడిచి యనంతరంబ
పరమసద్గతిఁ జెందును పాండవేయ. 14

తే. గీ. చిత్త మన్యంబునందును జెందకుండ
నిత్యమును నన్నుఁ దలపోయు నిర్మలునకు
యోగభావన బాయని యుత్తమునకు
నేను మిక్కిలి సులభుండ నిజము పార్థ. 15

వ. మఱియు మత్సంబంధమైన పరమగతి నొందినమహాత్ములు దుఃఖా
శ్రయంబును, నశాశ్వతంబును నగు పునర్జన్మంబు నొంద. 16

తే. గీ. బ్రహ్మలోకాదిలోకసంప్రాప్తు లయ్యు
మరలుదురు గాదె పుణ్యముల్ మాసినపుడె
విష్ణులోకనివాసులై వెలయువారు
మగిడి జన్మంబునకు రారు మాన్యచరిత. 17

వ. మఱియుఁ గృత, త్రేత, ద్వాపర, కలియుగంబులు నాలుగు యుగం
బులు నొక్క మహాయుగం బయ్యె, నట్టి మహాయుగంబులు వేయు
నన బ్రహ్మదేవునకు దివసం బయ్యె, నింతియె కాలంబు రాత్రియై
వర్తిల్లు, యిట్లతని దివారాత్రుల కాలంబు మహాత్ము లెఱుంగుదురు.

తే. గీ. జంతువులు బ్రహ్మదివమున సంభవించు
రాత్రి వచ్చినయప్పుడు ప్రళయమందు
పరగ నవ్యక్తమని యొడు ప్రకృతియందుఁ
బుట్టుటయుఁ గ్రమ్మరను వానిఁ బొలయుటను. 19

తే. గీ. భూతములు బ్రహ్మదివమునఁ బుట్టి పుట్టి
పురుషవర రాత్రియందును బొలసిపొలసి
కర్మపరతంత్రవృత్తిచేఁ గ్రమ్మరంగ
పుట్టుచుండును నిరతంబుఁ బుడమియందు. 20

వ. మఱియుఁ బరమపురుషుం డగు వాసుదేవుండు ప్రకృతికంటెఁ బరుం
డును, తద్వ్యతిరిక్తుండును, చక్షురాద్యగోచరుండును, సనాతనం
బును, చరాచరప్రళయంబునందును, తా లయంబు నొందనివాఁడై
ప్రవర్తిల్లుచుండును. 21

తే. గీ. అక్షరంబును నవ్యక్త మనఁగ నొప్పి
పరమగతి సంజ్ఞతోడనె పరగునదియు
పొంది మరలంగరాని యప్పుణ్యపదము
ననఘ నాయదిగాఁ జూడు మాదరమున. 22

తే. గీ. ఏమహాత్మునిలో నుండు నీప్రపంచ
మేమహాత్మునిచే వ్యాప్త మీప్రపంచ
మట్టిపురుషుని బొందుట కనఘచరిత
పరమ మగు సాధనము లేదు భక్తికంటె. 23

క. ఏకాలంబున యోగులు
ప్రకటముగ మరణమొంది రా రవ్వేళన్
వ్యాకులతఁ జచ్చి వత్తురు
నీ కాకాలంబుఁ దెలియ నే నెఱిఁగింతున్. 24

వ. మఱియు మకరసంక్రాంతి మొదలుకొని మిధునాంతరంబుగా నుత్త
రాయణ మనఁబడు, నయ్యయనంబు దైవతంబు, తదయనంబున శుక్ల
పక్షంబున దివంబున మృతుం డైనయోగీశ్వరుండు నగుబ్రహ్మ
వేత్త బరబ్రహ్మస్థానంబునకుఁ జని యెడి మార్గంబున నగ్ని కిరణంబు
లుగల సూర్యుండును, దివాధిదేవతయు, శుక్లపక్షాభిమాన దేవత

యు, ప్రకాశమానంబులై యుండు రిట్లు చని, బ్రహ్మస్థానంబు నొంది
పునరావృత్తిరహితుండై శాశ్వతుండై యుండు. 25

ఆ. వె. చంద్రదైవతంబు సముదితధూమంబు
నశితపక్షరాత్రి సమగమించి
దక్షిణాయనమున ధన్యాత్ముఁ డగుయోగి
చచ్చి మగిడివచ్చు జన్మమునకు. 26

వ. విను మీశుక్లకృష్ణమార్గంబులు రెండును జగంబునకు శాశ్వతం
బులు. వీనియందు శుక్లమార్గంబుచేత ననావృత్తియుఁ గృష్ణమా
ర్గంబుచేత నావృత్తియుం గలిగి వర్తిల్లు. 27

ఆ. వె. ఇట్టి రెండుగతుల నెఱిఁగిన యోగీంద్రుఁ
డాశపడఁడు సర్వ మధిగమించు
నట్లుగాన నీవు నఖిల కాలములందు
యోగవృత్తిచేత నుండు పార్థ. 28

ఉ. వేదములన్ మఖంబులను విశ్వతదానతపంబులన్ సము
త్పాదిత మైనపుణ్యము నధఃకరణం బొనరించుయోగి యు
య్యాదిమపూరుషోత్తము నిజార్థము నెమ్మది సంగ్రహించి ని
ర్వేదన లేక నాద్య మగువిష్ణుపదంబును జెందు నర్జునా. 29

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వ్యాసదేవ ద్వాదశాక్షరీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆప
స్తంబసూత్ర హరితసగోత్ర గాయమాంబాగర్భసం
జాత నాగోజీపండితపుత్ర దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునందు
అష్టమాధ్యాయము.

శ్రీరస్తు.

# భగవద్గీత.



## నవమాధ్యాయము.



### —రాజవిద్యా రాజగుహ్యయోగము.—

వ. శ్రీభగవంతుం డిట్లనియె. 1

తే. గీ. గుహ్యతమ మిడి మిక్కిలి గోరి తెలియ
జ్ఞానవిజ్ఞానకలితమై జరగు నీకుఁ
దెలియఁజెప్పెద నే దానిఁ దెలిసితేని
యశుభములఁ బాయఁగల దసూయావిదూర. 2

వ. మఱియు విద్యలకు శ్రేష్ఠంబును, గుహ్యంబులకు రాజును, పవిత్రంబులకు నుత్తమమును, బ్రత్యక్షఫలంబును, సుకరంబుగాఁ జేయవచ్చినదియును నై ప్రవర్తిల్లు. 3

తే. గీ. ఇమ్మహాధర్మగతియందు నెవ్వరేని
శ్రద్ధతోడుతఁ బాసిన జాడ్యపరులు
వాఁడు నన్నుఁ బొందఁజాలరు వసటచేత
మృత్యుసంసారపథమున మెలఁగుచుందురు. 4

తే. గీ. బ్రహ్మమైనట్టి నాచేత బ్రహ్మసృష్టి
రక్షితంబయి వ్యాప్తమై రమణఁబొందు
భూతముల కెల్లఁ గారణభూత మేను
కార్యమగు భూతములయందుఁ గలుగ నెపుడు. 5

వ. మఱియు నాయందు భూతము లున్నయవి గావున మదీయం బగు భూతవ్యాపకత్వంబున నున్నవాఁడను. భూతముల రక్షించువాఁడ

నయ్యును, అహంకారయుక్తుం డగుజీవునిబోలి నిరహంకారుండగు
నేను భూతములయందు నుండును గాన. 6

తే. గీ. అన్నిటందునూ నాశ్రైన యాజ్ఞచేత
విపులవాయువు పూర్ణమై నెలయునట్లు
సకలభూతచయంబును సంతతంబు
నాదు నిర్గుణతేజంబునను వసించు. 7

తే. గీ. ప్రాణిజాలంబునందైన ప్రకృతియందు
సంగతంబగు కల్పాంత సమయమునను
తిరుగ కల్పాదియందు నుద్దీపితముగఁ
జేయుచుందును నీభూతసృష్టి పార్థ. 8

వ. వినుము నేను మదీయంబగు ప్రకృతి నధిష్ఠించి కల్పాంతంబునందు
నాయందు లీనమైన చతుర్విధసృష్టిం దదీయపూర్వకర్మానుసారం
బున సృజియింపుచుందుదు. 9

తే. గీ. విశ్వసృష్ట్యాదికర్మముల్ వెలయ నన్ను
బద్ధుగాఁ జేయనోపవు పార్థ లీల
దానియందును నే నుదాసీను బోలి
యుండుదును జూవ్వో యాశక్తి నుజ్జగించి. 10

తే. గీ. ప్రకృతి నా దగు నధ్యక్షభావమునను
విశ్వసృష్టి యొనర్చుచు వెలసె గాదె
అనఘ యిదికారణంబుగా నఖిలజగము
నురుతరముగాఁ బ్రవర్తింపుచుండు నెపుడు. 11

తే. గీ. మూఢులైనమనుష్యులు మోహమంది
నన్నెఱుంగరు పరుఁడైన నాథునంచు
భక్తజనరక్షణమునకై పాఁడవేయ
మానుషాకారమును బొంది మలయుకతన. 12

వ. వినుము నాకంటె నన్యదేవతలు శీఘ్రఫలప్రదులని, మోఘాశ లును, మద్విముఖత్వంబు నమోఘకర్ములును, కృతకర్మంబులచేత మోఘజ్ఞానులును, చపలచిత్తులు నైన మూఢాత్ములు రాక్షసం బును నాసురంబు నైన మోహకరప్రకృతి నాశ్రయించినవారై నన్నెఱుంగ లేరు. 13

తే. గీ. దేవియైనట్టి ప్రకృతిచే ధన్యులగుచు
వెలయుచుందురు మహాత్ములు విశ్రుతముగ
అవ్యయుండును భూతాది నైననన్ను
భజనసేయుదు రెపు డన్యభజన ముడిగి. 14

ఉ కొందఱు కీర్తనప్రియతఁ గొల్తురు నన్ను దృఢవ్రతాఢ్యులై
కొందఱు సేవజేయుదురు కొందఱు వందనకర్మతత్పరుల్
కొందఱు యోగయుక్తులయి కోరి భజింతురు యుక్తిభక్తి న
న్నంద నమస్కృతుల్ సుకృతి నాప్తతముల్ విను పాండవోత్తమా.

వ. మఱియుఁ గొందఱు జ్ఞానయజ్ఞంబుచేత నన్ను నేకత్వంబున సహ స్రశీర్షుం డగు విరాట్పురుషుండవియును, పృథక్త్వంబుచే లక్ష్మీ నారాయణాత్మకం బనియును, బహుధాత్వంబుచేత మత్స్యాదిచే చతుర్వింశత్యవతారాత్మక మనియును, విశ్వతోముఖంబు చేతబ్రహ్మ రుద్రాదిదేవతాసమూహాత్మకంబనియు నుపాస్తిచేయుచుందురు. 16

చ. క్రతువును విష్ణురూపమును, కాలనియుక్తము పైత్ర్యకంబులౌ
వితమహౌషధంబులును విశ్రుతమంత్రము లాజ్యముఖ్యముల్
హుతవహుఁడున్ హుతంబులును నొప్పుగఁ దత్వవిదుండు బుద్ధిచే
సతతము నేనె కాఁ దఁలచు సజ్జనవర్యులు మెచ్చ ఫల్గునా. 17

తే. గీ. తల్లి దండ్రియు ధాత పితామహుండు
వేద్యమును ప్రణవంబు పవిత్ర మనఘ

ఋగ్యజుస్సామములు జగత్త్రితయ మనఘ
నేనె కాఁ దలపోయు మనీషవరుఁడు. 18

వ. మఱియు ఫలంబును, పోషకర్తయు, నియామకుండును, శుభాశుభద్రష్టయు, భోగస్థానంబును, రక్షకుండును, హితకర్తయు, స్రష్టయు, సంహర్తయు, నాధారంబును, లయస్థానంబును, అవ్యయంబగు బీజంబును నేనెకా మహాత్ముం డెఱుంగు. 19

తే. గీ. తపనశీలుండు వర్షప్రదాత నేనె
యేనె యమృతంబు మృత్యువు నెన్నఁ దగిన
సత్స్వరూపంబు మఱియు నసత్స్వరూప
మేనెకాఁ జూచు నమ్ఁ గొల్చు సిద్ధతముఁడు. 20

సీ. వేదవిద్యలచేత వెలయుమహాత్ములు,
సోమపానంబున సొంపుమీఱి
పాపసంఘంబుల భస్మముల్ గావించు
యజ్ఞకర్మంబుల నలరఁ జేసి
స్వర్గలోకమునకుఁ జయ్యన నేగి త
న్మహనీయసంపత్సమాశ్రమమున
దివ్యభోగంబుల దేవతాసానులౌ
రంభాదిసంసర్గరతులఁ దగిలి

తే. గీ. యెంతకాలంబు తత్పుణ్య మెచ్చియుండు
నంతకాలంబు స్వర్గంబు నధివసించి
క్రీడ సలుపుచు నేపార్చిదుఁ గేవలముగ
నమరలోకంబుఁ గోరియు ననఘవర్యా. 21

తే. గీ. ఆమహాత్ములు స్వర్గంబు ననుభవించి
పుణ్యమెల్లను క్షీణమై పోయెనేని

మగిడివత్తురు భువికి యిమ్మాడ్కి స్వర్గ
కాముకులు పొందుదురు గతాగతము లనఘ. 22

తే. గీ. అన్యచింతలు మనమున నడరనీక
యోగయుక్తిని నను గొల్చు యుక్తతముల
విమలయోగంబు సేమంబు వెలయఁదాల్చి
పోషణము సేతు నిత్యవిభూతిననఘ. 23

తే. గీ. అన్యదేవాతిపూజల ననఘచరిత
భక్తియుతులై చరించు తద్భక్తవరుల
పూజలన్నియు నను వచ్చి పొందుఁగాన
మోక్ష మియ్యరు వరభోగములను దక్క. 24

తే. గీ. యజ్ఞములకెల్ల భోక్తనై యులరువాఁడ
యజ్ఞములకెల్ల ప్రభుఁడనై యమరువాఁడ
నేనె కావున నన్నిట్లు నెఱుఁగనట్టి
మూఢచిత్తులు పొందరు మోక్షపదము. 25

వ. వినుము దేవతాయజులు దేవతలను పితృయజ్ఞులు, పితృదేవతలను, భూతయాజులు గణాధిపమాతృకాదిభూతంబులను బొందుదురు. నన్ను యజించువారు పరమానంద స్వరూపుఁడనగున న్నే పొందుదురు.

క. ఫలమైన పుష్పమైనను
జలమైనఁ బత్రమైనఁ జక్కని భక్తిఁ
వెలయుచు నర్పించిన నది
చెలఁగి గ్రహింపుదును బ్రీతిచేతస్కుఁడనై. 27

వ. కావున నీవుచేయు కర్మంబులను నీవు భక్షించు భక్షణంబులును, నీవు వేల్చు హోమంబులను నీవు సత్పాత్రులకిచ్చు దానంబులను నీవాచరించు తపంబులును, మదర్పణంబు సేయుము. 28

తే. గీ. కర్తృచయ నిర్మితంబులై కడఁవచ్చు
నురుశుభాశుభము లెల్లను నజ్జగించి
మహిత సన్న్యాసయోగంబు మహిమదాల్చి
నన్ను బొందఁగగలవు ధన్యత్వమునను. 29

తే. గీ. సర్వభూతము లందును సముఁడ నేను
నాకు ప్రియుఁడును విద్వేషి నరుఁడ లేఁడు
భక్తితోడుత నన్నుఁగొల్చి పరగునట్టి
వారు నావారు నేనును వారివాఁడ. 30

తే. గీ. అతిదురాచారపరుఁడైన నన్యదేవ
భజనమొల్లక నన్నుఁగొల్చి పరఁగె నేని
సాధుచరితుఁడనుచు వానిఁ జర్చసేయు
మధికతరభక్తి నిశ్చలుఁ డనితలంపు. 31

వ. వినుము దురాచారుఁడైన మద్భక్తుండైన పురుషుండు శీఘ్రకాలం
బున ధర్మాత్ముండగు పరమశాంతిఁ బొందు. దీనసంశయంబులేదు.
దీనికి కుతర్కవాదులు సందేహించెదరని తలఁచితేని నీవు నిశ్శంకు
డవై భేరీమృదంగకాహళాది వాద్యఘోషపూర్వకంబుగా తద్వివాద
పరుల సభకుం జని యూర్ధ్వబాహుండవై, అత్యంత దురాచారుండ
వైననేమి విష్ణుభక్తుండు చెడడని ప్రతిజ్ఞసేయుము. తత్ప్రతిజ్ఞవలనఁ
తత్తత్కుతర్కవాదులు కుతర్కంబులు మాని నిన్ను గురునిగా
నాశ్రయించి నన్నుఁ బొందుదురు. 32

తే. గీ. పాపయోనులు సద్గతిపరులు గాని
స్త్రీలు వైశ్యులు శూద్రులు తేజమెసగ
దీపితావ్యభిచారభక్తిని గ్రహించి
పరమగతి బొందెదరు సువ్వో పాండవేయ. 33

వ. కావున బ్రాహ్మణులును, రాజపురుషులునైన పుణ్యాత్ములగుమద్భక్తులు మోక్షంబునొందు టేమియాశ్చర్యంబు నీవును అనిత్యంబును, అల్పసుఖంబును, మర్త్యలోకంబును బొంది యీతుచ్ఛసుఖంబుల నాశింపక యాలస్యరహితుండవై నన్ను సేవింపుము.

సీ. అఖిలలోకేశుండ నైనట్టి నాయందు
హృదయంబు నిలుపుమా యిందిరతనయ
భక్తపరాధీనభావంబు గలనాకు
భక్తుండ వగుము బీభత్స యెపుడు
బహిరంతరంబుల బాయకుండెడి నన్నుఁ
బూజసేయుము పాండుభూపతనయ
బ్రహ్మాదివందితపదపద్ముఁ డగునన్నుఁ
బ్రణుతిగావింపుము పార్థ నీవు

తే. గీ. మత్పరాయణభావంబు మఱువకుండు
చిత్తమున యోగ మెప్పుడు చెదరనీకు
యిన్విధంబున వర్తించితేని వేగ
చిరతరానందమయి నన్నుఁ జెందఁగలవు. 35

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమ ద్వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు వరేణ్య శ్రీపాదపద్మారాధక వేములగంటిపురనివాస ఆప స్తంబసూత్ర హారితసగోత్రి గాయమాంబాగర్భసం జాత నాగోజీపండితపుత్రి దత్తోజీపండిత ప్రణీతం బైన భగవద్గీతాశాస్త్రంబునందు నవమాధ్యాయము

శ్రీరస్తు.

# భగవద్గీత.

## దశమాధ్యాయము.



### విభూతియోగము.

వ. శ్రీభగవంతుం డిట్లనియె. 1

తే. గీ. నీకుఁ బ్రియమును హితమును నెఱయఁగోరి
మరలి మరలియు గోప్యంపు మాటలెల్లఁ
జెప్పెదను విను నిశ్చలస్నేహ మలర
ప్రిథజ జయశీల రణరంగభయవిదూర. 2

తే. గీ. దేవతావళి ఋషులైన తేటపడఁగ
నాదుజన్మంబు నెఱుఁగరు నయవిధిజ్ఞ
దేవతలకును ఋషులకుఁ దెలిసిచూడ
కారణము నేనె కనుఁగొను కలుషదూర. 3

తే. గీ. అలర నాద్యంతరహితుండు నజుఁ డటంచు
సకలలోకములకు నెల్ల స్వామి యనుచు
నెవ్వఁడేనియు మది నన్ను నెఱుఁగువాఁడు
మోహ మందక పాపనిర్ముక్తిఁ గాంచు. 4

వ. మఱియు బుద్ధియు, జ్ఞానమును, మోహరాహిత్యంబును, క్షమయు సత్యంబును, బాహ్యేంద్రియనిగ్రహంబును, శాంతియు, సుఖంబును, దుఃఖంబును, జన్మంబును, జన్మాభావంబును, భయంబును, భయరాహిత్యంబును, నావలన నైనదిగా నెఱుంగుము. 5

క. తపమును దానముయశము
నపయశమును హింసతుష్టియుగు సమితపరం
తపభూతకోటికెల్లను
విపులంబైన నావల్ల వెలసెం జుమ్మా. 6

వ. మఱియు భృగ్వాదిమహర్షిసప్తకంబును, సనకాదిచతుష్టయంబును,
స్వాయంభువాదిచతుర్దశమనువులును బ్రహ్మాత్మకం బగు నావల్లనె
మానసజాతులై కలిగిరి. వారివల్లనీ చరాచరసృష్టి యుత్పన్నం
బయ్యె. 7

తే. గీ. అధికతర నిశ్చయమున నాయవి యటంచు
నీవిభూతియోగంబును నెవ్వఁడెఱుఁగు
నతఁడు నిశ్చలయోగంబు నధివసించి
యోగి యగు సందియము లేదు రాగదూర. 8

తే. గీ. సర్వసృష్టికి నుద్భవస్థాన మేను
సర్వమును నాదు మహిమచే జరుగుచుండు
ననుచుఁ దెలిసి భజింతురు యాత్మవిదులు
బుధులు భావంబులోఁ బొరపొచ్చెముడిగి. 9

వ. మఱియు నాయందు చిత్తంబు గలవారును, మద్గతజీవులును, మదీ
యధర్మంబులు తా మెఱిఁగి పరులకు బోధించువారును, మత్కథా
మృతంబువలన సంతుష్టిఁబొంది, రోమోద్గమానందబాష్పగద్గదస్వ
రంబులచేత రమించువారునై మదీయులునై నమహాత్ములు ప్రవ
ర్తింపుచు నుందురు. 10

తే. గీ. ఇట్టియుక్తమనస్కులై యెంచి నన్నుఁ
బ్రీతితోఁబూజసేయు మత్ప్రియుల కేను
ననుఁ బ్రవేశింపు హేతువై యొనరునట్టి
బుద్ధియోగంబు నిత్తును బురుషవర్య. 11

తే. గీ. వారియం దుండు నేఁ గృపా వైభవమున
వారి యజ్ఞానతిమిరంబు వత్సలతను
బాయఁ జేయుదు జ్ఞానదీపంబుచేత
వారిహృదయంబులకు వశవర్తి నగుచు. 12

వ. అనిన విని యర్జునుం డిట్లనియె దేవోత్తమా, పరబ్రహ్మంబవును, పరంధామంబవును, పవిత్రంబును, పరమపురుషుండవును నీవ, నిన్ను సహస్రశీర్షుం డనియును, శాశ్వతుం డనియును, దివ్యమూర్తి వని యును, నజుండ వనియు విభుండ వనియును 13

తే. గీ. పలుకుచుందురు సర్వ ఋషులు యో పద్మనయన
ఆశ్రితుండు దేవలుండును వ్యాసమౌని
దేవఋషి నారదుండు నట్లు తెలిసి యుందు
రలమితోఁడుత బలికితి వీవు నట్లు. 14

తే. గీ. ఎద్ది నాతోడఁ బలికితి విద్ధచరిత
యది యశేషంబె సత్యంబె యరసిచూడ
నీమహాదివ్యమూర్తిని నిర్ణయించి
దేవదానవు లైనను దెలియలేరు 15

తే. గీ. భూతభావన భూతేశ పుణ్యపురుష
దేవదేవ జగత్పతి దివ్యమూర్తి
నీమహాత్వంబుఁ దెలియంగ నీకెగాక
యన్యజనులకు శక్యంబె యరసి తెలియ. 16

తే. గీ. ఏవిభూతుల చేత నీ వీప్రపంచ
మనఘ వ్యాపించియున్నాఁడ వావిభూతు
లెన్ని గల వన్నియును నాకు నేర్పరించి
పల్కఁగా శక్తుఁడవు నీవె పలుకు కృష్ణ. 17

తే. గీ. ఇవ్విధంబున నిన్ను నే నెల్లవేళఁ
జింతసేయుచుఁ దెలివితోఁ జెలఁగియుందు
నెందు నెందున నీమూర్తి నెసఁగఁ జూచి
సన్నుతింపుదు చెప్పవే సాధువర్య. 18

తే. గీ. నీవిభూతియు యోగంబు నెంచు నాకు
విస్తరించి వచింపవే విమలచరిత
మరల మరలంగఁ జెప్పిన మామకీన
హృదయపద్మంబునందు సంతృప్తి గనదు. 19

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 20

తే. గీ. అన్న యర్జున మస్సమాయతవిభూతి
విస్తరంబున కంతంబు వెలయ లేదు
గాన ప్రాధాన్యములఁ గొన్ని గణనసేసి
నీకు నెఱిఁగింతు వినుమయ్య నిశ్చలతను. 21

తే. గీ. సకలభూతాంతరంగసంస్థాయి నగుచుఁ
దేజరిల్లెడువాఁడని తెలియుమయ్య
విను గుడాకేశ మద్భూతవితతి కెల్ల
నాదిమధ్యాంతములు నేనె యరసిచూడ. 22

వ. విను మదితిపుత్త్రులందగు దేవతలలోపల విష్ణుండను, ప్రకాశమానం
బులలోపల సూర్యుండను, మరుత్తులలోపల మరీచియు, నక్షత్త్రంబు
లలోపల చంద్రుండను నేనకా నెఱుంగుము. 24

తే. గీ. వేదములలోపల సామవేద మేను
దేవగణములలో నింద్రదేవుఁ డేను
యింద్రియంబులలో చిత్త మేనె సుమ్ము
భూతకోటులలోని విస్ఫూర్తి నేను. 24

తే. గీ. రుద్రతతిలోపలను శంకరుఁడ నేను
యక్షరాక్షసయుతిలోన నర్థపతిని
అష్టవసువులలోపల యగ్ని నేను
ఎంగుల పొడవైనగిరులలో మేరు వేను. 25

వ. మఱియుఁ బురోహితులలోపల దేవపురోహితుండును, ముఖ్యుండు నైనబృహస్పతి యేను. సేనాధిపతులలోపల దేవసేనాధిపతి యగు కుమారుండ నేను. స్థిరజలాశయంబుల లోపల సముద్రుండ యేను సుమ్ము. 26

తే. గీ. మహర్షులలోన భృగువరమౌని నేనె
వాక్సమూహంబులను ప్రణవంబు నేనె
యజ్ఞములలోన జప మనుయజ్ఞ మేను
స్థావరములలో హిమాచలము నేను. 27

తే. గీ. సకలతరువులలోన నశ్వత్థ మేను
వీరవరదేవఋషులలో నారదుండఁ
తెలఁగు గంధర్వవరులలోఁ జిత్రరథుఁడఁ
గపిలుఁ డనువాఁడ నే సిద్ధగణములోన. 28

వ. మఱియు నశ్వంబులలోపల నుచ్చైశ్శ్రవంబును, గజేంద్రులలోపల నమృతసహితోద్భవం బగునైరావతంబును, మనుష్యులలోపల మనుష్యాధిపతి యగురాజును నేనె సుమ్ము 29

తే. గీ. ఆయుధంబులలో వజ్ర మనఁగ నేను
ధేనువులలోపలను కామధేను వేను
ప్రజనకారణ మైనదర్పకుఁడ నేను
వాసుకుని యేను మూర్ధాహివరులలోన. 30

తే. గీ. నాగములలో ననంతుఁడ నరుఁడ నేను
వరుణుఁడను నేను జలనాథవరులలోన
అర్యముఁడ నేను పితృసమూహములలోన
నియమకర్తలలోపల నేనె యముఁడ. 31

తే. గీ. అనఘ దైత్యులలోన ప్రహ్లాదుఁ డేను
గణనబెట్టెడివారిలోఁ గాల మేను
సింహ మేఁ జుమ్ము వరమృగశ్రేణిలోన
గరుడుఁ డనువాఁడ నేఁ బక్షిగణములోన. 32

తే. గీ. పవనుఁడను నేనె ఘనవేగపరులలోన
రాఘవుఁడ నేను శస్త్రభృద్రాజిలోన
మత్స్యసంతతిలోన మకర మేను
జాహ్నవిని నేనె సుమీ సరిత్చయములోన. 33

వ. మఱియు నాకాశాదిసర్గంబుల నాదిమధ్యావసానంబులును, విద్యలలోపల నధ్యాత్మవిద్యయు, శాస్త్రవాదములైన వాదజల్పవితండుల లోపల వాదము నేనె సుమ్మి. 34

తే. గీ. వర్ణములలోన కార మకారవస్తు వేను
విమలగుణద్వంద్వ మే సమాసములలోన
అక్షరం బగు కాలంబు ననఘ నేను
విశ్వతోముఖుఁ డగుధాతను వెలయ నేను. 35

తే. గీ. ఈజగములు సమయించు మృత్యు వేను
భాగ్యమొందను గలవారి భద్ర మేను
స్త్రీలలోపలఁ గీర్తిలక్ష్మియును వాక్కు-
స్మృతియు మేధయు క్షమయును ధృతియు నేను. 36

వ. సామంబులలో బృహత్సామంబును, వేదమంత్రములలోపల గాయత్రీమంత్రంబును, మాసంబులలో మార్గశీర్షంబును ఋతువుల లోపల వసంతంబను ఋతువును నేనె సుమ్ము. 37

తే. గీ. దనర నన్యోన్యపంచక తత్త్వ మేను
జనుల కుద్యోగజయములు యనఘ నేను
సాత్త్వికావళియు జ్వలసత్త్వ మేను
వాసుదేవుండ నే వృష్ణివరులలోన. 38

తే. గీ. నిపుణవర పాండవులలోన నీవె నేను
మునులలోపలఁ దద్వ్యాసమునిని నేనె
కవులలోపల నెల్ల భార్గవుఁడ నేనె
దమనకరులైన రాజుల దండ మేను. 39

తే. గీ. నెంకి జయాపేక్షజనముల నీతి నేను
గోప్య గోపనకర మౌనగుణము నేను
జ్ఞానిజనముల నిర్మలజ్ఞాన మేను
సకలభూతంబులకును బీజంబు నేను. 40

వ. మఱియు నీప్రపంచంబు మద్వ్యతిరిక్తంబు కలుగదు గావున.

తే. గీ. నాదుదివ్యవిభూతి కంతంబు లేమి
గాన యంతయుఁ జెప్ప శక్యంబు గాదు
చెప్పితిని నీకుఁ గొంత సంక్షేపముగను
వింటివా యర్జున విభూతి విస్తరంబు. 42

తే గీ. పూజితము శ్రీకరంబునై పోలు నెద్ది
విశ్వతైశ్వర్యమహిమచే వెలయు నెద్ది
యట్టివస్తువులను మది నరయుమయ్య
పరఁగ మామకతేజాంశభవము లనుచు. 43

తే గీ. వేఱు వేఱ విభూతులు విస్తరింప
నేల వేర్వేఱఁ దెలియంగ నేల నీకు
అఖిల మైనప్రపంచంబు నావరించి
యనఘ నిలిపినవాఁడ నేకాంశమునను. 44

ఇది సకలసుకవిజన సేవాపరాయణ జోత్యాది దత్తోజీ పండిత
ప్రణీతంబైన శ్రీభగవద్గీతాశాస్త్రార్థంబు నందు
దశమాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.



## ఏకాదశాధ్యాయము.



### —విశ్వరూప సందర్శన యోగము—

వ. అనిన విని యర్జునుం డిట్లనియె. 1

తే. గీ. స్వామి నన్ను ననుగ్రహింపఁగను గోరి
యతులమైనట్టి కరుణఁ బల్కిలివి గాదె
యధికతరగుహ్య మైనయాధ్యాత్మవిద్య
దానిచే నాదుమోహంబు దలఁగిపోవు. 2

వ. కృష్ణ, కమలపత్రాక్షా! భూతజాలంబులు, సృష్టిప్రళయంబులు,
విస్తరించి నీవు చెప్పఁగా నీచేత నైనవిగా వింటిని. ఆదికారణ మైన
నీవైభవ్య, నైష్కృత్య రహితలక్షణం బగు నీమహాత్వంబును
వింటిని. 3

తే. గీ. నీవు పల్కినయంతయు నిజము గాఁగ
విశ్వసించినవాఁడ నో విమలచరిత
భూరివైభవయుత మైనపుణ్యమూర్తిఁ
జూడ వాంఛింపుచున్నాఁడఁ జూపు మయ్య. 4

తే. గీ. ఆమహామూర్తిఁ జూడంగ నపరిమేయ
పాత్రభూతుఁడ నేని నీ పరమకరుణఁ
జూపఁగదవయ్య నీమహాశుభదరూప
మవ్యయైశ్వర్య తేజోబలాత్మకంబు. 5

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 6

తే. గీ. చూడు నారూపములఁ బార్థ శోభితముగ
శతసహస్రాదికంబుల సంఖ్య లడర
నఖిలవిధములు గల్గి దివ్యంబు లగుచుఁ
బెక్కువర్ణాకృతులతోడఁ బెరయు వాని. 7

తే. గీ. రుద్రులను, వసువులను, మరుద్గణముల
నశ్వినుల, నాదితేయుల, నడరఁ జూడు
పెక్కు లాశ్చర్యములు చూడు వేయువేలు
మునుపు జూడనియవి నాదు తనువునందు. 8

వ. మఱియు నాదివ్యదేహంబున సచరాచరం బైనసమస్తజగత్ప్రపంచమును నవ్యయం బగుజగత్ప్రపంచంబును జగదవస్థాదివిశేషంబులను, జయాపజయంబులను జూడుము. 9

తే. గీ. ప్రాకృతాక్షులచేత నోపాండవేయ
చూడఁగనులేవు నామూర్తి శుద్ధముగను
దివ్యనేత్రంబు లిచ్చెద దెలివిమీఱఁ
జూడు నాయోగసంపద శోభనముగ. 10

వ. అనుచు శ్రీకృష్ణుం డర్జునునితోఁ బలికె నని సంజయుఁడు ధృతరాష్ట్రునితో మఱియు నిట్లనియె 11

తే. గీ. ఇట్లు కారుణ్యవిస్ఫూర్తి నెసఁగఁ బల్కి
యోగివల్లభుఁ డగుపురుషోత్తముండు
పార్థునకుఁ జూపె తరతరభవ్యమూర్తి
రాజితైశ్వర్య ధృతరాష్ట్రరాజవర్య. 12

తే. గీ. పెక్కు ముఖలోచనంబులు పెక్కులైన
దివ్యభూషణాచయములు తేజరిల్లఁ
బెక్కుదివ్యాయుధంబులఁ బెరయునట్టి
యద్భుతాకారు నర్జునుఁ డంతఁ గాంచె. 13

తే. గీ. దివ్యమాల్యాంబరములచేఁ దేజరిల్లు
దివ్యగంధానులేపనదీప్తమూర్తి
అద్భుతాకారమయుఁ డైనయయ్యనంతు
విశ్వతోముఖుఁ జూచె నవ్వీరవరుఁడు. 14

తే. గీ. దివిని సూర్యసహస్రముల్ దేజరిల్లి
యొక్కపెట్టునఁ బ్రభవమై యొప్పిరేని
యట్టిసూర్యులు నొకమూకయై యపరిరేని
యతనికాంతికి సమ మని యనఁగవచ్చు. 15

తే. గీ. అప్పు డేకస్థ మైనట్టి యఖిలసృష్టి
నఖిలవిధముల సువిభక్త మైనదాని
యనఘు వీక్షించె నర్జునుం డద్భుతముగ
దేవదేవుని నిర్మలదేహమునను. 16

తే. గీ. అప్పు డావిశ్వమూర్తిఁ దా నలరఁ జూచి
విస్మయంబొంది పార్థుండు వెఱచి మేనఁ
గంపమును రోమహర్షంబు గలుగ మ్రొక్కి
కేలు ముకుళించి పలికె నాకృష్ణుతోడ. 17

సీ. చూచుచున్నాఁడ నీ శోభనతనువున
సర్వలోకంబుల సర్వమైన
భూతజాలంబులఁ బుంఖానుపుంఖమై
దీపించుచుండెడి దేవతలును
గమలాసనస్థుఁడై కమనీయకాంతులు
ప్రకటించుచుండెడు పద్మభవుని
నీలకంఠుని నిత్యనిర్మలచరితులఁ
బరమయోగీంద్రులఁ బరమపురుష

ఆ. వె. మఱియు దివ్యులైనమహనీయ ఋషులను
నురగగణముఁ జూచుచున్నవాఁడ
దేవదేవ సకల దేవతావందిత
జగదధీశ దివిజసార్వభౌమ. 18

సీ. విశ్వేశ నీదగు విమలస్వరూపంబు
కడపల యెక్కడఁ గానఁబడదు
బాహుసంఘంబులు పరఁగ లెక్కకుమీఱి
సర్వత్ర దృశ్యమై చదలు నిండె
ఉదరంబు లెన్నియో యూహ లెక్కింపను
వక్త్రంబు లెన్నో యీవరుసఁ దెలియ
నేత్రంబు లెన్నియో నీలకంఠున కైన
వశము గాకున్నవి వెసగణింప

తే. గీ. అంత మెయ్యదియో చూడ నలవిపడదు
మధ్య మెయ్యదో నిర్ణయింపంగరాదు
తెలియరాకున్న దాది యో దేవదేవ
యెట్లు వర్ణింతు నీమూర్తి నెట్లు జూతు. 19

తరల. గద కిరీటము చక్రమున్ దగుకాంతులం బ్రకటింపఁగా
విదిత తేజము చాలఁ జూడ్కికి విస్మయం బొనరింపుమీ
సదమలాంగము వహ్ని సూర్యుల చాయ్పునన్ విలసిల్లెనో
సదయ నీదగుదివ్యరూపము చాల నిన్ను నుతింపఁగా. 20

వ. దేవదేవా నీ వక్షరం బగుపరబ్రహ్మంబవు, ముముక్షు వేద్యుండవు, సకలవిశ్వంబునకు పరమనిధానం బైనప్రియుండవు, శాశ్వతరక్షకుండవు, సనాతనుండవు, సహస్రశీర్షుండ వగుట నిజ మయ్యె, నాకు సంతసం బయ్యె. 21

మత్తకోకిల.

ఆదిమధ్యతయంతశూన్యు ననంతవీర్యసముజ్జ్వలున్
మోదకృచ్ఛసి సూర్యనేత్రు సముద్ధతానలవక్త్రునిన్
వేదవేద్యు ననంతబాహుని విశ్వతాపకతేజునిన్
యాదిపూరుషు సర్వతోముఖు నప్రమేయుని జూచితిన్. 22

తే. గీ. అన్నిదిక్కుల నీమూర్తి యాక్రమించె
నింకె రోధోంతరాళంబు నిర్మలాత్మ
యద్భుతం బగునీరూప మలరఁజూచి
సకలలోకంబు సాంద్రోపతాంద్రి మయ్యె. 23

తే. గీ. సురలు గొందఱు శరణంబు జొచ్చువారు
భీతులై కొంద ఱంజలిఁ బెనుచువారు
నైరి సిద్ధర్షితతి స్వస్తి యనుచు భీతి
సన్నుతింపఁగఁ జొచ్చె నోచక్రహస్త. 24

సీ. రుద్రసంఘాతంబు రూఢిగా నినుఁ జూచి
విస్మయం బందె నో వృష్టివర్య
ఆదిత్యగణము నీయద్భుతాకృతిఁ జూచి
విస్మయం బందె నో విమలతేజ
వస్తుసమూహజావరవైభవము చూచి
విస్మయం బందె నో వేదవేద్య
సాధులు నీమూర్తి సరభసంబుగఁ జూచి
విస్మయం బంది రో విశ్వరక్ష

తే. గీ. విశ్వదేవతలును మఱి యశ్వినులును
పితరు లాయక్షగంధర్వాసురులు ననుర
సిద్ధసంఘంబు నిన్ను వీక్షించి మిగుల
విస్మయం బంది రేమని వినుతిసేతు.

సీ. అనఘాత్మ నీరూప మత్యంత మై యున్న
దఖిలప్రపంచంబు నాక్రమించి
పెక్కు వక్త్రములతోఁ బొలుపు వహించియుఁ
బెక్కు నేత్రములతోఁ బృథుల మగుచు
బాహుసంఘంబుచేఁ బాఁగ శ్రేష్ఠత నొంది
యూరుసంచయముచే నొప్పుమీఱి
ఉదర పాదాళిచే నుజ్జ్వలస్ఫూర్తి యై
యుగ్రదంష్ట్రావళి నుల్లసిల్ల
తే. గీ. యిట్టి భవదీయరూపంబు నెనసి జూచి
లోకమెల్లను నతిభీతిఁ గోల మయ్యె
నాదుహృదయంబు భయ మొందె నలిననేత్ర
పుణ్యచారిత్ర దేవకీపుత్ర కృష్ణ. 26

వ. మఱియుఁ బరమపురుషా, నభోవ్యాపకంబును, నత్యంత విస్తీర్ణంబును, ననేకవర్ణంబును, వ్యాత్తాననంబును, దీప్తివిశాలనేత్రంబును నగు నీదివ్యమూర్తిఁ గాంచి నాదుచిత్తంబు భయము నొందె. అధైర్యం బయ్యె. శాంతి బొందదు. కృష్ణా! 27

క. కాలానలాభదంష్ట్రా
జ్వాలలను గరాళ మైన స్వామిముఖంబుల్
జూడఁగఁ గని దిగ్భ్రమచేఁ
దూలితి సుఖ మాత్మఁ గానఁ దొడరను కృష్ణా 28

తే. గీ. పోరిఁ గోరెడి ధృతరాష్ట్రపుత్త్రగణము
సూతసూతియు ద్రోణ భీష్ములును రెంకు
పక్షములయందుఁ గల రాజపటలితోడ
నీముఖంబుల వేర్వ్రాలి నిలిచినారు. 29

తే. గీ. పరువులెత్తుచు మీముఖపటలిలోనఁ
జొచ్చుచున్నారు వీరలు చోద్యముగను
ననఘ కొందఱు ఘోరదశనాంతరముల
నరయఁ బడిరిదె భగ్నోత్తమాంగములను. 30

తే. గీ. నదులు బహుళప్రవాహంబు లుదధిలోనఁ
జోద్యమందఁగ నురువడిఁ జొచ్చునట్లు
జూచుచున్నారు నరలోకశూరు లెల్ల
తావకీనప్రదీప్తవక్త్రములలోన. 31

తే. గీ. అగ్నియందుఁ బతంగము లధివసించి
హానిఁ బొందెడిచాడ్పున నఖిలజనులు
నీమహోజ్జ్వలముఖముల నెఱివసించి
నాశ మొందుచున్నారు నలిననేత్ర. 31

వ. దేవ, విశ్వవ్యాపక. అత్యంతప్రకాశమానము లైనవదనంబుల
చేత సమస్తవీరుల నిశ్శేషంబుగా భక్షించుచున్నవాఁడవు, నీప్రవ
ర్తన మేమియు నే నెఱుఁగ. 33

వ. అనిన విని శ్రీభగవంతు డిట్లనియె 34

మత్తకోకిల.

లోకసంహృతి చేయుకాలుఁడ లోకసంఘము ద్రుంపఁగాఁ
బ్రాకటంబుగఁ బుట్టినాఁడఁ బ్రభావసంపద నిమ్మహిన్
పాకజిత్సుతయోధవీరుల ఖండనంబునఁ జంపఁగా
నేకవీరుఁడ నీవు నేఁ బను లేల చెప్పఁగ వీనికిన్. 35

సీ. అది కారణమ్మున నర్జున! లే లెమ్ము
యుద్ధంబు సేయంగ నుత్సహించు
యశమును రాజ్యంబు నరయంగఁ గైకొమ్ము
శత్రులఁ గెల్చి వాసవతనూజ

నీవు చంపకమున్నె నిగిడిన దుర్జయు
లైన వీరుల నేనె యణచినాఁడ
యిది నిశ్చయమ్ముగా నెఱిఁగి నెమ్మది దీని
కొనగ నిమిత్తమై యుండరాదె

తే. గీ. కదనరంగంబులోన నుత్కటబలంబు
నడరి నేతెంచినట్టి మత్తాదినృపుల
మర్మభిద్దివ్యశరపరంపరలచేత
నెడమకుడినేయు నేర్చిన యుద్ధశౌర్య. 36

సీ. ద్రోణుండు సంగరదోర్బలోగ్రుండును
భీష్ముఁడు శాత్రవభీకరుండు
వినుము జయద్రథుఁ డనువాఁడు మిక్కిలి
బలియులలోపల బలియుఁ డనఘ
కర్ణుండు కురురాజకర్ణభూషణావృత్తి
విలసిల్లుచుండును విజయశాలి
యితర యోధావళు లీజగంబౌతయు
మిన్నంగ శక్తులై మెలఁగువారు

తే. గీ. నిఖిలధీరులు నాచేత నిహతులైరి
జయము గైకొమ్ము లే లెమ్ము సంగరమున
కించుకయు భీతి మదిలోన నెనగనీకు
ఖేద మొందకు వైరులఁ గెలువఁగలవు. 37

వ. అని కృష్ణుఁ డర్జునునితోఁ బలికెనని సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బలికె. అర్జునుండు మఱియు హరిని స్తుతించి యిట్లని విన్నవించె.

సీ. దేవేశ వైకుంఠ దివ్యప్రభాపూర్ణ
నీమహాకీర్తిచే నిఖిలజగము

హార్షింపుచున్నది యనురాగమహిమచే
విలసిల్లుచున్నది విపులముగను
భీతులై రాక్షసుల్ పెక్కుదిక్కులకును
బరువెత్తుచున్నారు బలిమి దొరగి
సిద్ధసంగమెల్ల చేతులు ముకుళించి
మ్రొక్కుచు నున్నారు మోదమలర
తే. గీ. తగును భవదీయ మగు సమర్థత్వ మనఘ
చోద్య మేమనవచ్చు ప్రస్తుతచరిత్ర
దేవదేవేశ లక్ష్మీశ దివ్యపురుష
సర్వతోముఖ దేవతాసార్వభౌమ. 39

వ. దేవా- నీవు మహాత్ముండవు, బ్రహ్మదేవునికంటె శ్రేష్ఠుండవు, ఆది కర్త, వనంతుండవు, దేవేశుండవు, జగన్నివాసుండవు, సదసత్తులగు జీవశరీరంబులకు మూలంబైనయక్షరబ్రహ్మవు, నీకు బ్రహ్మరుద్రాదులందు నెవ్వరు సములు, సమానాధికరహితుండవు, బ్రహ్మరుద్రాదిసర్వసేవ్యుండవు. 40

సీ. అఖిలదేవతలకు నాదిదేవుఁడ వీవు
రమణీయమూర్తి పురాణపురుష
సకలసృష్టికి లయస్థానంబునకు నీవ
విశ్వవేత్తవు నీవ విమలతేజ
దివ్యమానులకును దెలియఁగా రానట్టి
దైత్యవధాతు సుస్వామి నీవ
నీచేత వ్యాప్తంబు నిఖిలప్రపంచంబు
సంతతోదార యనంతరూప
తే. గీ. సర్వదేవనమస్కారచరణపద్మ
భక్తలోకగృహాంగణపారిజాత

మానవమానసనీరజమత్తభృంగ
దేవకీపుత్ర రిపుజైత్ర దివ్యగాత్ర. 41

వ. మఱియు వాసుదేవా, యముండును, నగ్నియు, వరుణుండును, శశాంకుండును, ప్రజాపతియు నీవ. భృగ్వాదిమునులును సృష్టికర్త లగుటఁ జేసి ప్రపంచమునకు జనకులైరి. తజ్జనకుం డగుటఁ జేసి చతుర్ముఖుండు లోకంబునకుఁ బితామహుం డయ్యె. తదీయజనకుండ వగుటం జేసి లోకమునకుఁ బితామహుండవును, ఆదికారణంబ వదిగావున నీకు సహస్రనమస్కారంబు లొనర్చెద. మఱియు సహస్రనమస్కారంబు లొనర్చెద. వెండియు సహస్రనమస్కారంబు లొనర్చెద.

ఉ. మ్రొక్కెద నీకు నోయనఘ ముంగల వెన్క సమస్తదిక్కులన్
మిక్కిలి భక్తితోడుత నమేయపరాక్రమ నీవె యిజ్జగం
బొక్కటి లోన వెల్పల సముజ్జ్వలదీప్తుల నిండినట్టిస
మ్యక్కమనీయమూర్తి దురితాళివిమోచన పద్మలోచనా. 43

సీ. ప్రాకృతసఖుఁడ వని ప్రాకృతబుద్ధిచేఁ
గమలాక్ష నిన్నెఱుంగంగ లేక
హే కృష్ణ హే సఖే హే యాదవ యటంచుఁ
బలికితి ధిక్కారభాషణముల
నఖిలప్రపంచంబు నావరించి వెలుంగు
మీ విశ్వరూపంబు మీ సమగ్ర
మహిమంబుఁ దెలియక మందబుద్ధికుఁడనై
చపలచిత్తుఁడనైతి జడుఁడనైతి
తే. గీ. ప్రాణవశ్యంబుచే నేమి పలికినాను
కడుఁ బ్రమాదంబుచే నేమి నుడివినాను
యిట్టి యపరాధజాలంబు లెల్ల నన్నుఁ
గరుణఁ జూచి సహింపవె కంసహరణ. 44

వ. మఱియు నచ్యుత నిన్ను నే నపరిమేయుండని తెలియలేక బావ యను తలంపున నేకాంతమున సఖీజనసమక్షంబునఁ బరిహాసార్థంబు విహారశయ్యాసనభోజనములయందుఁ దిరస్కారవాగపరాధంబుల క్షమింపుము. 45

సీ. జనకుండ వీవ యీసచరాచరం బైన
త్రైలోక్యమునకును దైత్యమదన
గురుఁడవు నీవెకా గురుతరం బైనట్టి
విశ్వసృష్టికి నెల్ల వేదవేద్య
త్రిభువనపూజ్య మై తేజరిల్లఁగ నిష్ట
చారిత్రుఁడవు నీవె జలజనయన
లోకత్రయమునందు నీకు సమానుఁడు
గలుగఁడు చర్చింపఁ గమలనాథ

తే. గీ. అధికుఁ డెవ్వఁడు నీకంటె నరసిమూంక
మంజులారావయప్రతిమాప్రభావ
భక్తవత్సల దేవేశ పరమపురుష
వాసుదేవ జనార్దన వరద కృష్ణ. 46

వ. కావునఁ బరమేశ్వర, జగద్దివ్యచరిత్ర, నీకు దండప్రణామంబు లాచరించెద, నాయందుఁ బ్రసన్నచిత్తుండవై పుత్రు నపరాధంబులు తండ్రి క్షమించునట్లు చెలికాని యపరాధంబులు చెలికాఁడు క్షమించునట్లు ప్రియురాలి యపరాధంబులు ప్రియుఁడు క్షమించునట్లు నాయపరాధంబులు క్షమించి నన్ను రక్షింపవే నమో శ్రీ వాసుదేవా. 47

మత్తకోకిల.

తొల్లి జూడనిమూర్తి గావున తొంగలించుచు మేను నా
యుల్లముం గడు భీతి నొందెడి నుజ్జగింపఁగదయ్య యీ

బల్లిదం బగువిశ్వరూపము పద్మలోచన నీసుసం
ఫుల్లపంకజలోచనం బగు పూర్వరూపము జూచెదన్. 48

తరల. గద కిరీటము చక్రముఖ్య ఘనకాంతిచే విలసిల్లఁ గా
విదిత మైనచతుర్భుజంబుల విస్ఫురత్కృతి మీఱ నీ
సదమలాకృతి చూపు మిప్పుడు సర్వతోముఖ యాత్మలో
ముదము వాంఛయు నంతకంతకు ముమ్మరం బై యొప్పెడిన్.

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. అర్జునా, మదీయయోగసామ
ర్థ్యంబున నీకుఁ జూపఁబడిన యీ తేజోమయంబును విశ్వోత్తమం
బును అనంతంబును ఆద్యంబు నైనరూపంబు భవద్వ్యదవశ్యులగు
భక్తులకుం దక్క తక్కినవారలకుఁ జూపఁబడదు. 50

సీ. వేదపాఠముచేత విలసిల్లుపుణ్యులు
శ్రోత్రవిద్యాపరిజ్ఞానపరులు
తపములచేఁ జాల తపియించుమౌనులు
దానతత్పరు లైనధన్యమతులు
దేవపూజలచేతఁ దేజరిల్లెడిధీరు
లౌపాసనంబుల నలరువారు
రాజసూయాధ్వర రాజయాజకులశ్వ
మేధాదుల భజించి మెలఁగువారు

తే. గీ. నిట్టిమహనీయరూపంబు నెలమితోడఁ
జూడ శక్యులుగారు విశ్రుతచరిత్ర
మనుజలోకంబునందును మత్ప్రసాద
నిర్మలాత్ముఁడ వైనట్టి నీవు దక్క. 51

తే. గీ. అతుల మగువిశ్వరూపంబు నలరఁ జూచి
మదిని మోహంబు వ్యథయును మాను పార్థ.

భీతి బోఁదోఁచి మిక్కిలి ప్రీతి బొంది
కృష్ణరూపంబుఁ జూడుమా కేవలముగ. 52

వ. అని శ్రీకృష్ణుం డర్జునునితోడఁ బలికె నని ధృతరాష్ట్రునితోఁ జెప్పి
సంజయుండు మఱియు నిట్లనియె. 53

తే గీ పరమపురుషుండు నరునితోఁ బలికి పలికి
తనదు శ్రీకృష్ణరూపంబు దాల్చె నపుడు
సౌమ్యతరమూర్తి దాల్చి యాసర్వగతుఁడు
ధారుణీశ్వర యర్జును నూఱడించె. 54

వ. అప్పు డమ్మహామహునితో నర్జునుం డిట్లనియె. 55

తే. గీ. నీది మానుషరూపమే నిర్మలాత్మ
సౌమ్యమగుదానిఁ జూచిన సంభ్రమమున
పరవశం బైన చిత్తంబు పాదుకొని యేఁ
బ్రకృతిభావంబు నొందితిఁ బ్రస్తుతముగ. 56

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 57

తే. గీ. అధికతర మైనదుర్దర్శ మైనయట్టి
నీవుచూచినరూపంబు నిర్మలాత్మ
చూడ వాంఛింపుదురు సుమ్మీ శుద్ధహృదయు
లైనదేవతు లెల్లను నహరహంబు. 58

తే. గీ వేదముల నైన యజ్ఞాదివిధుల నైన
దానముల నైన ఘనతపోధనుల కైనఁ
జూడశక్యంబు గాకుండుఁ జుమ్మీ పార్థ
నీవు జూచినరూపంబు నిక్కముగను. 59

తే. గీ. ఇట్టిరూపంబుతోడుత నెనఁగునట్టి
నన్ను నెఱుఁగంగ నను జూడ నన్నుఁ బొంద

భక్తియోగంబె తలపోయ పరమమైన
సాధనము గాని మఱి లేదు సాధనంబు. 60

క. మదధీనకర్మకర్తయు
మదధీనాశ్రితుఁడు నట్లె మత్పరముఁడు భూ
తదయాళుఁడు నిస్సంగుఁడు
పదిలుఁడు నగువాఁడు నన్నుఁ బ్రాపించు నరా. 61

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వాసుదేవ ద్వాదశాక్షరీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆప
స్తంబసూత్ర హారితసగోత్రి గాయమాంబాగర్భసం
జాత నాగోజీపండితపుత్ర దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునందు
నేకాదశాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.

## ద్వాదశాధ్యాయము.

### భక్తియోగము.

వ. అని యిట్లు శ్రీభగవంతుం డానతిచ్చిన నర్జునుం డిట్లనియె 1

తే. గీ. యోగయుక్తిని భక్తిచే నొప్పుగాను
పూజ లొనరించు నాతఁడు పుణ్యపరుఁడు
నక్షరం బగు నవ్యక్త మాశ్రయించు
వారిలోపల నెవ్వఁడు వరతపస్వుఁడు. 2

వ అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 3

తే. గీ. మనసు నామూర్తియందున మరగఁజేసి
యోగి యై శ్రద్ధతోఁ బూజ లొనరఁజేయు
వాఁడు యుక్తతముండునై వానికెక్కు-
సర్వవిధముల మన్ననస్సమ్మతుండు. 4

వ. విను మర్జున, అక్షరంబును, అనిర్దేశంబును, అవ్యక్తంబును, అచింత్యంబును, కూటస్థంబును, ధ్రువంబు నగు పరబ్రహ్మము నుపాస్తి చేయుము. 5

తే. గీ. చిత్తమును నింద్రియంబులఁ జిక్కఁబట్టి
సర్వగతముగ బ్రహ్మంబు సమతఁ జూచి
భూతహితవర్తనంబునఁ బొదలువారు
నన్నుఁ బొందెడివారె సూ నయవిధిజ్ఞ. 6

తే. గీ. నిర్గుణమునందు నిష్ఠచే నిలుచువారి
కధికతరమైన క్లేశంబు లావహిల్లు
పార్థ వినవయ్య నిర్గుణబ్రహ్మనిష్ఠ
భూరిదుఃఖంబుచేఁ గాని పొందఁబడదు. 7

వ. కావున సర్వకర్మంబులు నాయందు నర్పించి మత్పరుఁడై యన్యదేవతాసక్తంబు గానిచిత్తంబుచే నన్నుఁ గరచరణాద్యవయవసంయుక్తమూర్తిగాఁ దలపోయుచు షడక్షర్యష్టాక్షరీద్వాదశాక్షరీప్రభృతి వైష్ణవమంత్రోపాస్తి సేయుచునే మహాత్ము లుందురు. 8

తే. గీ. అట్టి మదధీనచిత్తుల నహరహంబు
నుద్ధరింపుదు వేగంబె నురుబలాఢ్య
ఘోరతరమైనమృత్యుసంసారవార్ధి
యందు మగ్నులు గాకుండ నరసి యేను. 9

తే. గీ. మనము నాయందు నిలుపంగ మట్టుపఱుపు
బుద్ధియును మద్గతము గాఁగఁ బొందుపఱుపు
మిట్టులైన సందియం బింతతలప
దనఘ పొందెద నన్ను దేహాంతమునను. 10

తే. గీ. చిత్త మనఘాత్మ నాయందె స్థిరముగాఁగఁ
జేర్పలేవేని మదిలోనఁ జింత నలను
వెగ్గలింపక నభ్యాసయోగమునను
నన్నుఁ బొందంగఁ దలఁపు మభ్యున్నతముగ. 11

వ. మఱియు యోగాభ్యాసంబున సమర్థుండవైతివేని మదర్థకర్మంబు లగు నేకాదశీప్రభృత్యుపవాసవ్రతంబులును, మన్మూర్తి[illegible]మైన సాలగ్రామపూజాదిపరిచర్యలును, మన్నామసంకీర్తనములను జేయుము. దానివలన మోక్షంబు నొందఁగలవు. 12

తే. గీ. దీనికిని శక్తుఁడవు గాక మాని తేని
యనఘ నన్ శరణంబుగా నాశ్రయించు
నియత మానచిత్తకర్మముల్ నీవొనర్చి
ఫలము గోరక నాయందు భార మిడుము. 13

వ. వినుము యోగాభ్యాసంబుకంటె జ్ఞానంబు శ్రేష్ఠము, జ్ఞానంబుకంటె
ధ్యానంబు విశిష్టంబు, ధ్యానంబువలన కర్మఫలత్యాగం బగు. కర్మఫల
త్యాగంబున మోక్షంబు సిద్ధించు. 14

తే గీ. ఉత్తములయందు సములందు న్యూనులందు
నలుగమియు మైత్రియును గృప నడరనిల్పి
నిర్మమత్వ మహంకారనిరసనంబు
క్షమయు సుఖదుఃఖసమతయు నలుపవలయు. 15

తే. గీ. ఎంతగల్గినో యంతకె సంతసిల్లి
యప్రమత్తత నియతాత్ముఁడై కడంగి
బుద్ధి మనమును నాయందుఁ బొందుపఱచు
దృఢుఁడు మద్భక్తుఁ డాతఁడు ప్రియుఁడు నాకు. 16

వ. మఱియు నెవ్వనివలన లోకంబు భయంబుచేత సంక్షోభంబు నొంద
కుండు, నెవ్వఁడు లోకంబువలనిభయముచేత సంక్షోభంబు నొంద
కుండు, నట్టిమద్భక్తుఁడు నాకుఁ బ్రియుండు. 17

క. అనపేక్షుఁ డుదాసీనుం
డనలసుఁ డగతవ్యథనుఁ డఖిలేహావ
ర్జనపరుఁడు శుచియు నగుమ
ద్ఘనతరభక్తుండు నాకుఁ గడుఁ బ్రియుఁడు సుమీ. 18

వ. మఱియుఁ బ్రియప్రాప్తియందు హర్షంబు, నప్రియప్రాప్తియందు
ద్వేషంబు, యిష్టార్థనాశంబున శోకంబు నొందకుండు, నప్రాప్తంబగు
దానిఁ కెవ్వఁడు దుఃఖింపఁడు, స్వకీయశుభప్రాప్తికి హర్షింపకుండు,

నెవ్వఁడు పరశుభప్రాప్తికి నీర్ష్యపడకుండు, నెవ్వఁడు భయంబు నొందకుండు, నెవ్వఁడు భయాధినిమిత్తంబగు చిత్తక్షోభంబు నొందకుండు, నెవ్వఁడు అర్థంబునందు కాంక్షయుఁ, బుణ్యపాపములయందు నాసక్తియు లేని మద్భక్తుండు నాకుఁ బ్రియుండు. 19

తే. గీ. శత్రుమిత్రులు శీతోష్ణసౌఖ్యదుఃఖ
ములను మానావమానముల్ నొయఁ దనకు
సమము గాఁ దలంచి సంగవర్జన మొనర్చి
తనరు మద్భక్తవరుఁడు నాకు బ్రియుండు. 20

వ. మఱియు నిందాస్తుతులందు సముండును, మౌనవ్రతపరాయణుండును, నెంతమాత్ర మర్థంబు దైవనియుక్తిని ప్రాప్తం బగునంతన సంతుష్టుండును నాయందు స్థిరబుద్ధియు నగు మద్భక్తుండు నాకుఁ బ్రియుండు. 21

తే. గీ. అనఘులెవ్వార లిట్టిధర్మామృతంబు
మది నుపాసించు శ్రద్ధాసమగ్రచిత్తు
లట్టివారలు మత్పరు లనఘ వినుము
నాదుభక్తులు మిక్కిలి నాకుఁ బ్రియులు. 22

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీవాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురుపరంపరాప్రాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురువరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆపస్తంబసూత్ర హరితసగోత్ర గాయమాంబాగర్భసంజాత నాగోజీపండితపుత్త్ర దత్తోజీపండిత ప్రణీతంబైన భగవద్గీతాశాస్త్రంబునందు ద్వాదశాధ్యాయము.



శ్రీరస్తు

# భగవద్గీత.

## త్రయోదశాధ్యాయము.

### క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

వ. మఱియు శ్రీభగవంతుం డిట్లనియె.

క. ఈ దేహము కుంతీసుత
యాదరమతిఁ గ్షేత్ర మనుచు నెఱుఁగుమి యా
యీదేహవిదుని జీవుని
వాదట క్షేత్రజ్ఞుఁ డనుచు నరయుము మదిలోన్. 2

క. క్షేత్రంబులందు నర్జున
క్షేత్రజ్ఞుఁడ నెపుడు నను భజింపుము మదిలో
క్షేత్రక్షేత్రజ్ఞత్వము
వృత్రహసుత నన్నెఱుంగు విధ మగుఁజుమ్మా. 3

వ. మఱియు నాచేతఁ జెప్పఁబడిన క్షేత్రంబె జడస్వభావంబు గలది. ఎటువంటి యాశ్చాదిధర్మం బైనది యన యింద్రియ వికారంబులతోడఁ గూడిన యదియే ప్రకృతి పురుషులనఁదగునదియె స్థావరజంగమాదులచేత భిన్నంబైనది మదీయోక్తం బగు నక్షేత్రజ్ఞుఁ డెవ్వఁడతండు నా ప్రభావంబుచేతఁ బ్రసన్నుఁ డదియంతయు సంక్షేపించి నీకుఁ జెప్పెద వినుము. 4

తే. గీ. బ్రహ్మసూత్రపదాగమపటలిచేత
ఋషులచే హితమవ్వచః శ్రేణిచేత
నిశ్చితంబులచేతను నిర్ణయింపఁ
బడినయర్థంబుఁ జెప్పెద పార్థ నీకు. 5

వ. మఱియుఁ బృథివ్యాదిపంచమహాభూతంబులును, అహంకారమును బుద్ధియు, నవ్యక్తంబును, యింద్రియదశకంబును, మనంబును, నింద్రియగోచరం బగుశబ్దాదివిషయపంచకంబును ననఁ జతుర్వింశతి తత్త్వము లయ్యె. 6

తే. గీ. సుఖము దుఃఖంబు ద్వేషంబు గోరెడి యిచ్ఛ
దేహము నచేతనంబు నస్థిరము నయ్యెఁ
దనరు నీచతుర్వింశతితత్త్వములను
నఖము సవికారమై క్షేత్ర మనఁగఁబడును. 7

వ. వినుము జ్ఞానసంపన్నునకు తన్నుఁ దాఁ బొగడుకొనమియు, డంబవర్జనంబును, అహింసయు, క్షమయు, ననకృత్వంబును, మాతాపితాచార్యాతిథిపూజయు, బాహ్యాభ్యంతరశౌచంబును, నారాయణారాధనమునందు స్థైర్యంబును, యింద్రియమనోబుద్ధ్యాత్మకం బగు దేహంబున నధర్మగతి జాఱకుండుటయుఁ గలుగవలయు. అజ్ఞాననిరోధనంబును గలుగవలయు. 8

ఉ. ఇంద్రియసౌఖ్యసంపదల నేమియుఁ గోరక వీతరాగుఁడై
సాంద్రయశుం డహంక్రియలచక్కటిఁ బోవక దూరవృత్తియై
యింద్రజ! మేనికిన్ జరయు మృత్యువు జన్మము వ్యాధులన్ విని
స్తంధ్రిత దుఃఖదోషములు చాలఁగఁగల్గు టెఱుంగఁగాఁ దగున్. 9

తే. గీ. పుత్రదారాగృహంబులపొందు విడచి
వారి సుఖదుఃఖములకును వశుఁడు గాక
యిష్టసంప్రాప్తియందు ననిష్టలబ్ధి
యందు నేప్రొద్దు సమతచే నలరవలయు. 10

ఉ. పూని యనన్యయోగమునఁ బుట్టిన యవ్యభిచారభక్తిమ
ధ్యానపరాయణుం డగుచు తత్పరతన్ననుఁ బూజసేయుచున్

డానందసంపూర్ణుఁడై యొప్పి, శ్రీయోమహాస్ఫూర్తి యైనట్టి శ్రీలక్ష్మిఁ గావించె, నాత్మీయమాహాత్మ్య సంపత్తి! విశ్వంబు పాదంబు మోక్షంబు పాదత్రయంబై ప్రవర్తిల్లఁగాఁజేసి విశ్వంబు గావింప నారంభియై యంత శీఘ్రింబునన్, జేసె నాపుణ్యచారిత్రుఁడీ విశ్వసంధానియైనట్టి, జీవాభిమానంబుతో నొప్పు, రాజద్విరాణ్మూర్తిఁ గల్పించి, యామూర్తి విశ్వంబుతోఁ గూర్చి, భూమిం బురశ్రేణి గల్పించి, దోర్దోహవిస్సృష్టి గావించి, యాయజ్ఞకర్మమ్ములే దేహమైయున్న గీర్వాణులన్ జేసి, పార్థా వసంతంబునం గొంతకాలంబు గల్పించి యాజ్యంబుగావించి గ్రీష్మంబు గల్పించి ధర్మంబు గావించి, పార్థా, శరస్సృష్టి గావించి యా యజ్ఞకర్మమ్ములే దోర్దోహవిర్జాలమున్ జేసి, నాసత్వసంఖ్యాకభాస్వత్వ ిద్యాళి గావించి త్రిస్సప్త దివ్యత్సమిత్కల్పనం జేసి, యాదేవదేవుం డనేకామరశ్రేణి గల్పించి యాపంబు గల్పించి పుంస్త్వంబుతో నొప్పు నుద్యత్పశువ్రాతమున్ జేసి యయ్యజ్ఞబర్హిస్సు ౯ బ్రోక్షణశ్రేణి యజ్ఞం సృజించన్, మహాదేవుఁ డాకర్త చే దేవ ా సాధ్యజాలంబులన్ దృప్తినొందించె నాజ్యంబు గల్పించె నావాయు ర్గంబు గావించి గ్రామ్యంబుల౯ జేసి యారణ్యసర్గంబు గావించి పార్థా శువ్రాతము౯ జేసి యాయజ్ఞకర్మంబునన్ స్వసంతృప్తి గావించి ఋగ్వేదము న్నానసం బెద్ది బాహుద్వయం బెద్ది యూరుద్వయం బెద్ది, దద్వయం బెద్ది, యా దేవునాస్యంబున౯ బ్రాహ్మణుల్, బాహు ౯ క్షత్రియుల్, వైశ్యు లూరుప్రదేశంబులన్, శూద్రులు౯ మేటిపా ంబులన్ బుట్టి, రా దేవు చిత్తంబులో లోకజాలంబు నేకంబుగాఁ బుట్టె ాదేవు సామర్థ్య మిట్లేప్రవర్తిల్లె, నీసృష్టి నిర్మాతయైనట్టి దేవుండు సూ ప్రభాభాసియై, యంధకారంబు సంధిల్లకుండంగ బ్రవర్తిల్లె, నీసృష్టికి ్షమకర్మాదుల౯ జేసి, ధాత౯ బురస్కృత్యుగాఁజేసి, యీసృష్టిగా చు నద్దేవు విద్వాంసుని౯ నింద్రుని౯ దిక్స్వరూపు౯ మహావీరు నా

మానవవర్గముం గదియు మచ్చిక మాని విశుద్ధదేశ సే
వానిరతిఁ బ్రవర్తిలుట వాసవనందన నీకు నెప్పుడున్. 11

వ. మఱియు నధ్యాత్మికజ్ఞాననిత్యత్వంబును తత్త్వజ్ఞానంబునకుఁ బ్రయోజనంబైనమోక్షంబు సర్వోత్కృష్టం బనియాలోచించుటయుఁ గల్గిన యతఁడు జ్ఞాని, యాగుణంబులు లేనివాఁ డజ్ఞానియగుంబకును. 12

తే. గీ. ఎద్ది తెలిసినచో మోక్ష మెసఁగఁగల్గు
నట్టిబ్రహ్మంబుఁ జెప్పెద నలర నీకు
నదియు నారాయణాఖ్యమై యతిశయిల్లు
ప్రకృతి పురుషులకంటెను పరతరంబు. 13

దండకము.

స్వామీ, మహావైరిసంహర్తగోత్రారిపుత్రా, జగజ్జేత్ర, సుజ్ఞానపాత్రా, సుధాగోత్రవిశ్వంభరాభర్త కీవిశ్వ మెంతేనియున్ బాణిపాదంబులై నేత్రపద్మంబులై యుత్తమాంగంబులై, యాననాబ్జంబులై శ్రోత్రజాలంబులై యొప్పు నాయున్నతస్ఫూర్తిచే, లోకమావృత్తమై వర్తిలున్, విశ్వసృష్ట్యాది నాభిన్, స్వభావంబునన్ విశ్వమధ్యంబునన్ నాకసృష్టంబునున్ దోఁచి యాద్యంతశూన్యప్రభావంబు సంధిల్ల వర్తిల్లు నీపూర్ణరూపంబు సామ్యంబు బ్రహ్మాదులం దెన్నఁగా లేదు, తద్దేవతాశ్రేణిఁ జూడంగ నీనేత్రముల్ పాత్రముల్ గావుత న్నామధన్నామధేయంబు దాబ్రహ్మరుద్రామరశ్రేణికిన్ లేదు, తత్స్ఫూర్తి సత్యంబు జ్ఞానం బనంతంబునా నొప్పు నాదేవుఁ డీసృష్టి సాక్షాత్ పరత్వంబునన్ వేయి మూర్ధంబులన్, వేయునేత్రంబులన్, వేయుపాదంబులన్, దాల్చి భవ్యస్వరాట్ రూపమై యుద్భవం బయ్యు విశ్వ ప్రమాణాదనంబై ప్రవర్తిల్లి, శశ్వత్తరంబైన యాత్మాభిధానంబునన్ బొంది దశాంగుళాకారతంబొల్చి, భూతాళి భవ్యంబుగాపించి, తా నింతకున్ మృత్యుభావంబుచేతం బ్రవర్తిల్లు నాదేవుచే సృష్టి శోభిల్లు నాపుండరీకాక్షుఁ

ధింప నీకర్మమే కాని యన్యంబు లేదంత తద్దేవతాధిపునిఁ గూర్చి యజ్ఞంబు గావించి దివ్యాళి సాధ్యాళి స్వర్గస్థులైరిట్లు భూదేవతుల్ యజ్ఞకర్మంబు గావించి యాదేవలోకంబునున్ జెంది, సౌఖ్యంబునుఁ బొందిరా వేళ నాదేవుఁ డీభూమి విశ్వంభరాకారముం దాల్చి కూర్మాకృతై భారముం దాల్చె, నేదేవుగర్భంబునన్ బ్రహ్మవర్తిల్లె, నేస్వామికిన్ జన్మముల్లేక జన్మంబు సంధిల్లె, నాదేవు జన్మంబు లాకర్మకర్మంబు లాధ్యాత్మవేత్తల్ పరీక్షింతు రేదేవుఁ డీదేవజాలంబు సంవృత్తమొందంగ తద్దుష్టులన్ గూల్పఁ దా జన్మముల్ దాల్చె సౌఖ్యంబు దుఃఖంబులందించు నేస్వామి యాస్వామికిన్, లక్ష్మియున్ భూమి ధర్మార్థకామాదులన్ లోనుగానుండు, నేదేవు సుశ్లోకముల్ బ్రహ్మరుద్రాదిదేవాళి కీర్తించు నేదేవుఁ గీర్తించి భక్తాళి తేజోమయంబైన లోకంబునం దుండు, నాదేవునిన్ నిత్యునిన్ సత్యసంకల్పునిన్ నిత్యకల్యాణునిన్ దుఃఖసంహారకున్ సౌఖ్యసంధాయునిన్ సన్నుతింతున్ మఱిన్ మఱిన్ సన్నుతింతున్, మఱిన్ స్వామినిన్ బ్రార్థింతు, నాదేవుఁ గీర్తింతు. శరణు, శరణు, శరణు. 14

తే. గీ. విషయగుణముల నన్నిటి వెలయఁ జేయు
విషయగుణవర్జితక్రియా విలసితుండు
శక్తి లేకే ప్రపంచసంసక్తుఁ డగుచు
గుణియు నిర్గుణియుఁ గాక గణుతి కెక్కు. 15

వ. మఱియు భూతంబుల యంతరంగబహిరంగములు నతఁడ, చరాచరసృష్టియు నతండ, యత్యంతసూక్ష్మండు గావున నవిజ్ఞేయుండును నతండ, యజ్ఞానులకు దూరస్థితుండును నతండె. 16

తే. గీ. ఇట్లు విజ్ఞానులకు సన్నిహితుఁడు నతఁడె
ప్రాణులందును భిన్నమై పరఁగుచుండు

సర్గ మొనరించు బోషించు సంహరించు
ననుచు నమ్మూర్తి మఱి దెలియంగవలయు. 17

వ. మఱియు సూర్యాగ్నిచంద్రతేజంబులఁ బ్రకాశింపఁజేయువాఁడును, తమోదూరుండును, శాస్త్రజన్యం బగుజ్ఞానంబు తానయైనవాఁడును, సగుణత్వంబున జ్ఞేయుం డైన నారాయణుండును, అమానిత్వాదంభత్వప్రభృతిలక్షణజ్ఞానంబుచేతఁ బొందఁదగినవాఁడును, సర్వభూతహృదయస్థుండును నగువాఁ డతండె. 18

తే. గీ. ప్రకృతిపురుషులు నాయవి పార్థ నాదు
శక్తియును మఱినాదుయశంబె కాన
గుణవికారంబులను మఱి గురుకులీన
ప్రకృతిచే నైనవానిఁ గాఁ బరఁగ నెఱుఁగు. 19

వ. వినుము కార్యం బగుదేహంబునకు కారణంబులగు సుఖదుఃఖసాధనేంద్రియములఁ బ్రకృతికర్తృత్వంబులందు హేతు వని చెప్పంబడు జీవుండు ప్రకృతిజనితంబులగు సుఖదుఃఖములకు నభోక్తయైయుండియు ప్రకృతిసన్నిధానంబు గలుగుటఁ జేసిఁ భోక్తృత్వంబునకు హేతు వని చెప్పంబడును. 20

సీ. పురుషుండు ప్రకృతితోఁ బొందుసేయుటఁ జేసి
ప్రకృతివశంబునఁ బ్రభవ మొందు
సుఖమును దుఃఖంబు సొలవక యేప్రొద్దు
ననుభవింపుచు నుండు ననఘచరిత
యుత్తమయోనుల నుద్భవించుటయును
నీచయోనులఁ బుట్టి నెగడుటయును
సుకృతదుష్కృతముల సొరిదిగావించు న
య్యింద్రియసంగంబె హేతు వరయఁ

తే. గీ. గాన జీవుఁడు ప్రకృతితోఁ గలకనుండి
చిత్ర మగు దండధరు బాధఁ జెందునపుడు
నినుముతోడుతఁ గూడిన యనలుమాడ్కి
తనుజదుఃఖంబు నొందెడి జననిపోల్కి. 21

వ. విను సమీపంబున సాక్షిగాతుండై ప్రవర్తించువాఁడును, సన్నిధిమాత్రంబుచేతనే గ్రాహకుండును, భర్తయు, భోక్తయు మహేశ్వరుండును, పరమాత్మయు నని చెప్పంబడు పురుషుండు దేహస్థుండై యుండియు ప్రకృతిగుణంబులతోడ యుక్తుండు గాఁడు. 22

తే గీ. ఇవ్విధంబునఁ బురుషుని నెవ్వఁ డెఱుఁగు
ప్రకృతి నెవ్వఁడు సుఖదుఃఖభరిత గాఁగ
నెఱిఁగి యెవ్వఁడు వర్తించు నిల్లు పార్థ
మగుడఁ బుట్టక వాఁడు సమ్మదము నొందు. 23

వ. కొందఱు విశిష్టమతులు పరుఁ డగు వాసుదేవునిగా ధ్యానంబువలన తమ దేహంబునందు శుద్ధంబగు మనంబుచేతం జూతురు. కొందఱు సాంఖ్యంబున నఖండదర్శనపరులై బాలోన్మత్తపిశాచచిహ్నంబుల వర్తింతురు. కొంద ఱష్టాంగయోగంబుచేత నారాధింతురు కొందఱు హృదయస్థుం డైన పరమపురుషుండని నిరంతరావలోకనంబు సేయుచు వేదోక్తకర్మంబు లాచరించి యతనికి సమర్పణంబుఁ జేయుదురు. 24

తే. గీ. ధరను సామర్థ్యభక్తులు గురుముఖోక్తిఁ
దనరి హరిపూజఁ గావింతు రనఘచరిత
దాన సంసారనీరధి దాఁటువారు
మెల్లనె సులభత ముక్తి కొల్లగొందు. 25

తే. గీ. స్థావరము జంగమును నను సంజ్ఞ లొందవ
పరిభవ మొందెడి వేళల పాండవేయ
జ్ఞానసంయోగలిప్తుఁడు నాశ మొదవఁ
డనుచుఁ దెలివితోఁ జూచిన యతఁడు ఘనుఁడు. 26

వ. మఱియు సకలభూతంబులందును వాసుదేవుండు సమత్వంబున నుండునని యెవ్వఁడు జూచు నతఁడు యోగంబుచేత జీవుని నవిద్యా సంకుచితుని జేయక ముక్తునిం జేయును. 27

తే. గీ. కర్మముల కెల్లఁ బ్రకృతియె కర్త యనుచు
శోభితంబుగ నెవ్వఁడు జూచుచుండు
కర్త గాఁడని జీవుని ఘనుఁడు జూచు
నమ్మహాత్ముండు జూచిన యదియె చూపు. 28

వ. మఱియుఁ బ్రకృతి ప్రళయంబునందుఁ జరాచరసృష్టి తనయందుఁ బొందినదానిగాఁ జేయునని యెవ్వఁడు జూచు ప్రకృతివలన సృష్టి కాలంబునందు భూతంబులు విస్తరిల్లునని యెవ్వఁడు చూచు నతఁడు బ్రహ్మంబు నొందును. 29

తే. గీ. ఆదిశూన్యుండు పరమేశ్వరాంశజుండు
నవ్యయుండును నిర్గుణుండైనజీవుఁ
డనఘ దేహంబునందు దా నధివసించి
సేయకుండును లిప్తతఁ జెందకుండు. 30

తే. గీ. ఒక్కసూర్యుండు ఏకాంశ ముపగమించి
సకలలోకంబు వెలుగించు సామ్యముగను
దేహి దేహంబునందెల్లఁ దేజరిల్లఁ
జ్ఞేయు దేహగతుండునై సిద్ధ మనఘ. 31

తే. గీ. అరయ గా దేహ జీవుల యంతరంబు
ప్రకృతిచే ముక్తి జీవుఁడు పడయు తెఱఁగు
జ్ఞానదృష్టిని జూచు సన్న్యాసవుండు
భూరికైవల్యసౌఖ్యంబుఁ బొందు పార్థ. 32

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమ ద్వాసుదేవ ద్వాదశాక్షరీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆప
స్తంబసూత్ర హారితసగోత్ర గాయమాంబాగర్భసం
జాత నాగోజీపండితపుత్ర దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునందుఁ
ద్రయోదశాధ్యాయము.



శ్రీరస్తు

# భగవద్గీత.

## చతుర్దశాధ్యాయము.

### గుణత్రియ విభాగయోగము.

వ. శ్రీభగవంతుం డిట్లనియె. 1

తే. గీ. చెప్పెదను జ్ఞానరాజంబు శ్రేష్ఠతరము
పరమసుజ్ఞాన మిప్పుడు పార్థ నీకు
దీని నెఱింగిన మును లెల్లఁ దేజరిల్లి
ముక్తిఁ బొందిరి సంసారమోహ మెడలి. 2

తే. గీ. ఇట్టి సుజ్ఞానసంపత్తి నెడలి జనులు
మఱియు మమకారయుక్తులై మాన్యచరిత
జనన మొందు మరల బ్రహ్మ స్వర్గమునను
ప్రళయదుఃఖంబుఁ గనియు మర్త్యభవమున. 3

తే. గీ. ప్రకృతిపత్ని స్వరూపమై పరఁగు నాకు
దానియందు మదంశంబు దగులుపరుప
బ్రహ్మరుద్రాదిదేవతాప్రముఖ మైన
సకలభూతప్రపంచంబు సంభవించు. 4

తే. గీ. సకలయోనుల వివిధమై సంభవించు
భూతజాలంబునకు నెల్ల పురుషవర్య
ప్రకృతి జవస్వరూపమై పరగుచుండు
తలఁప బీజప్రదుఁడనైన తండ్రి నేను. 5

వ. మఱియుఁ బ్రకృతిసంభవంబు లగు సత్వరజస్తమోగుణంబులు

దేహంబునందుండ యవ్యయుండగు జీవుని స్వకార్యంబు లగుసుఖ
దుఃఖమోహంబులచేత బద్ధునిం జేయును. 6

తే. గీ. రజము రాగాత్మకం బది ప్రబలతృష్ణ
వలన సంగంబువలన భవంబు నొంది
కర్మసంగంబుచేత నుత్కటముగాఁగ
బద్ధుఁ జేయును జీవుని పాండుతనయ. 7

తే. గీ. తమము జనియించు నజ్ఞానదార్ఢ్యమునను
మోహనంబంది ప్రాణుల మోసపుచ్చు
తగ ప్రమాదాలసత్వనిద్రలను జీవు
బద్ధుఁగాఁజేయు వినవయ్య పాండుతనయ. 8

వ. మఱియును సత్వగుణంబు శోకాది కారణంబులు గలిగినను వాని
వెంబడి జననియ్యక జీవుని సుఖయుక్తుని జేయును. రజోగుణంబు
సుఖాదికారణంబులు గలిగి ప్రమాదంబునందె జీవునిన్ బ్రవర్తిం
పఁజేయు. మఱియు నత్తమోగుణం బాలశ్యాదులందుఁ బ్రవర్తిం
పంజేయును. 9

తే. గీ. తమమును రజమును ద్రోచి సత్వంబు వొడము
సత్వతమములు ద్రోచి రజంబు వొడము
సత్వరజములఁ ద్రోచి వాసవతనూజ
తమము వొడమును వినుము దృష్టమును జేసి. 10

క. జ్ఞానం బింద్రియపథమున
మానుగ దీపించెనేని మహితయశోర్ధి
వానిం బ్రవృద్ధసత్వా
నూనగుణోదారు గాఁగ నూహించు మహిన్. 11

వ. మఱియు రజోగుణప్రవృద్ధిమంతుం డగువాఁడు లోభప్రవృత్తియు
మహాగృహారామక్షేత్రనిర్మాణోద్యోగంబును సంకల్పవికల్పశక్తి

యు దృష్టమాత్రంబులగు సకలవస్తువులయందును సంగ్రహణేచ్ఛ యుం గలిగి వర్తిల్లును. 12

సీ. అవివేకయుక్తుఁడై యలరి యొక్కొక వేళ
సద్వివేకంబులు సలుప కుండు
ఉద్యోగహీనుఁడై యుండి యొక్కొక వేళ
కర్తవ్య మేమియుఁ గానకుండు
వివిధమిథ్యాజ్ఞానవికృతి నొక్కొక వేళ
మోహవిభ్రాంతిచే మునుఁగుచుండు
దుష్టసాంగత్యంబు దొడరి యొక్కొక వేళ
సజ్జనసంగంబు చాలదోయు

తే. గీ. ఇట్లు నరుఁడు తమోగుణం బెత్తి యదియు
వృద్ధిఁబొందిన నాగమవిధినియుక్తి
కర్మదూరత దుష్కర్మకలితుఁ డగుచు
సంచరించును గురువేద్యజలధిచంద్ర. 13

తే. గీ. సత్వగుణవృద్ధి గలిగిన సజ్జనుండు
మరణకాలంబునను గాని మహిమచేత
వెలయ ననుఁ దల్చి యుత్తమవిదుల లోక
మున వసియించును కల్మషంబులను దోసి. 14

క. రాజసుఁడు మరణమునకును
భాజన మైె పిదప మనుజభావము నొందున్
యీజగతి తామసుండు సవి
భ్రాజితభుజశౌర్య పొందుపడు భావమునన్. 15

తే. గీ. ఘనతరసుఖంబు సాత్త్వికకర్మమునకు
కఠినదుఃఖంబు రాజ

కౌరవోత్తమ తామసకర్మమునకు
నరయ నజ్ఞానమె ఫలంబు నయ్యెఁ జుమ్మి. 16

తే. గీ. సత్వగుణమున జ్ఞానంబె సంభవించు
లోభ మొదవు రజోగుణలాభమునను
మోహ మజ్ఞానమును దుఃఖము జనించు
పాండుతనయ తమోగుణప్రాప్తివలన. 17

తే. గీ. ఊర్ధ్వలోకంబున వసియించు నురుతరంపు
సత్వగుణమున వర్తిల్లు సజ్జనుండు
రాజసుఁడు మర్త్యలోకసంప్రాప్తి నొందు
తామసుఁడు పొందు నరకంబు తథ్యమిదియె. 18

వ. మఱియు వివేకియయిన మద్భక్తుండు సత్వరజోస్తమోగుణంబులే
కాని, కర్మంబుల కొండుకర్త లేఁడని తలంచు నెప్పుడు యపుడు
గుణంబులకంటె జీవుని యన్యునిగా నెఱుంగు నపుడె మద్భావంబు
నొందును. 19

తే. గీ. ప్రాకృతములగు గుణముల బాయఁద్రోచి
విష్ణు నవ్యయు నాత్మలో వెలయఁజూచు
నతఁడు మోక్షంబునొందు నో యనఘచరిత
జన్మమృత్యుజరాదుఃఖజలధి గడచి. 20

వ. అనిన విని యర్జునుం డిట్లనియె. 21

క. ఏచినహంబుల గుణముల
మోచి ప్రవర్తిల్లు దేహి ముదమున వాఁడే
యాచారంబున నడచుఁ గ
శాచరణము యెట్లు గుణములను జేయదగున్. 22

వ. అనినవిని శ్రీభగవంతుం డిట్లనియె. గుణాతీతుం డగు యోగీశ్వ
రుండు సత్వాదిగుణకార్యంబు లగుప్రకాశకప్రవృత్తిమోహంబులు

వ్రాందినప్పుడు ద్వేషంబునొందడు, తద్గుణకార్యంబులు నివృత్తంబై
నప్పుడు సంతసింపఁడు. 23

• గుణకృతసుఖదుఃఖంబుల
కణుమాత్రము చలన మొందక కవియెల్లన్ ద
ద్గుణకార్యంబులె యనుచును
ప్రణతుండౌ దేహి సాక్షిభావముచేతన్. 24

తే. గీ. సౌఖ్యదుఃఖములందును సదృశబుద్ధి
గలిగి సమలోష్టపాషాణకాంచనుండు
నభినుతియు నింద ప్రియము నప్రియంబు
సమముగాఁ జూచువాఁడువో యమరయోగి. 25

వ. మఱియు మానావమానంబులందును, మిత్రామిత్రపక్షంబులందును,
సముండును, సకలోద్యోగపరిత్యాగియు నగువాఁడు గుణాతీతుండని
చెప్పఁబడును. 26

తే. గీ. అన్యదేవత భక్తిపై నాశవిడిచి
నన్నెపూజింపుచుండు మానవుఁడు పార్థ
ప్రకృతిగుణసంగవర్జనపరత నొంది
బ్రహ్మభావంబు నొందును పాత్రుఁ డగుచు. 27

తే. గీ. ముఖ్యమును నవ్యయంబైన మోక్షమునకు
ధన్యవరశాశ్వతంబైన ధర్మమునకు
సంతతైకాంతికంబైన సౌఖ్యమునకు
తీవ్రమగు బ్రహ్మమైన ప్రదీప్తి నేనె. 28

గద్య. ఇది సకలసుకవిజన సేవాపరాయణేత్యాది దత్తోజీ పండిత
ప్రణీతంబైన శ్రీభగవద్గీతాశాస్త్రార్థంబు నందుఁ
జతుర్దశాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.

## పంచదశాధ్యాయము.

### —పురాణపురుషోత్తమప్రాప్తియోగము.—

వ. శ్రీమహాభగవంతుం డిట్లనియె. 1

గీ. ఊర్ధ్వమూల మధశ్శాక మొనర నగుచు
యెప్పటికిఁ బోని వేదముల్ యొప్పఁ బర్ణ
ప్రౌఢి నెసగు నశ్వత్థవృక్షంబు నెవ్వఁడెఱుఁగు
నతఁడు వేదార్థసంవేది యనఁగబరఁగు. 2

వ. మఱియు నా సంసారవృక్షమునకు సాత్త్వాదిగుణప్రవృద్ధంబులును విషయప్రవాళం బనంబరగు శబ్దస్పర్శరూపాదు లైన సుకృతదుష్కృతజీవులు శాఖలై యూర్ధ్వలోకంబును, నధోలోకంబును వ్యాపించె. దానికి నధఃప్రవృత్తులు నూర్ధ్వప్రవృత్తులు నగు మూలంబులైన భూతంబులు కర్మానుబద్ధులై మనుష్యలోకంబునఁ బ్రవర్తించును.

ఉ. దీనికి నాది నంతము ప్రతిష్ఠయు రూపము మృత్యు వెవ్వరుం
గానరు రూఢమూల మిది కౌరవవంశజ విస్ఫురత్తరం
బైన యసంగశస్త్రమున నార్యవరేణ్యుఁడు నిశ్చలాత్ముఁడై
దీని దృఢంబుగా దునిమిఁ దీపితమోదము నందు నిచ్చటన్. 4

ఆమీఁద దానికి నాశ్చర్య భూతమై
వర్తింపుచుండెడి వనజనాభు
తనుజుండు భక్తసంతతిపునర్జన్మ
పరిహార మొనరించు పరమపురుషు

వెదకంగవలయు నేవిశ్వరక్షకు చేత
నరయఁబురాతన మైనయట్టి
సంసారవృక్షంబు సంభవంబై చాల
విస్తారమును బొందె విశ్రుతముగ
తే. గీ. నట్టి వేదాంత వేద్యుని నాది పురుషు
సర్వలోకైకవంద్యుని సర్వసాక్షిఁ
బద్మలోచను దేవేశుఁ బరమపుణ్యు
శరణుఁబొందెద ననుచును సజ్జనుండు. 5

సీ. మానంబు చేతను మసలక యేపొద్దు
మోహంబుచేతను మొక్కవోక
పుత్రాదిసంసర్గ భూరిదోష మడచి
యాధ్యాత్మవిద్యచే నతిశయిల్లి
కామంబు లన్నియుఁ గడపల గావించి
సుఖదుఃఖనామవిస్ఫురణ గల్గు
ద్వంద్వంబు లేమియుఁ దనయందుఁ జొరనీక
విజ్ఞానసంపత్తి వెలయ నొంది
తే. గీ. సంచరించు మహాత్ములు చచ్చి చచ్చి
పుట్టి పుట్టి విపన్నతఁ బొందకుండు
నట్టిసుస్థానమైన యవ్యయపదంబు
చేరి భూలోకమునకును రారు పార్థ. 6

తే. గీ. ఎచట సూర్యప్రకాశంబు లెసఁగకుండు
నెందు ననలేందుకాంతులు చెందకుండు
తిరిగి రా రందువర్తించు నరులు భువికి
నదియె మామకనిర్వాణ మని యెఱుంగు. 7

వ. మఱియు నాయంశంబున సనాతనుం డగుజీవుఁడు సుఖప్రళయంబులం
దుఁ బ్రకృతియందు లీనం బగుచందంబునఁ బరివేష్టించిన మనంబును,
దశేంద్రియంబులను, ప్రాణంబులను, తీసుకొనివచ్చి జీవలోకంబు
నందు సృష్టికారణసంసారియై ప్రవర్తించును. 8

తే. గీ. దేహమువనుండి జీవుఁ డద్దేహమునకు
నరుగుతఱి నింద్రియాదుల నన్నిఁగొనుచుఁ
బోవు వాయువు పుష్పంబుతావి గొనుచుఁ
బోవుచాడ్పున నో పాండుభూపతనయ. 9

ఉ. శ్రోత్రము ... ... ... శోభనదీప్తివిస్ఫుర
న్నేత్రము మానసంబు గడునేర్పున జీవుఁడు వొంది శబ్దయుక్
ఘ్రాత్రరసంబుతావియును స్పర్శగు రూపము నాశ్రయించి త
చ్చిత్ర విచిత్ర సౌఖ్యములఁ జెందుచునుండును పాండవోత్తమా. 10

వ. మఱియు గుణాన్వితుం డగుజీవుఁడు దేహంబునుండి వేఱొక్క దేహం
బు నధిగమించు, నప్పుడైనను దేహగతుం డైనతఱినైనను, విషయం
బుల ననుభవించువేళనైనను యుక్తిం గనలేరు. జ్ఞానచక్షుష్టు లగు
మహాత్ములు చూచుచుందురు. 11

తే. గీ. యత్నపరు లైనయోగీంద్రు లాత్మయందు
సుస్థిరుం డగుజీవునిఁ జూతు రనఘ
యత్నపరులయ్యు నవిశుద్ధమైనమనము
గలుగువారలు జీవుని గానలేరు. 12

తే. గీ. ఎద్ది యాదిత్యగతమయి యుద్ధతేజ
మెద్ది చంద్రునిలోపల నెసగుదీప్తి
యెద్ది వైశ్వానరుండు వహించుకాంతి
యనఘ యదియెల్ల నాయది యనుచు నెఱుఁగు. 13

తే. గీ. భూతధాత్రి నధిష్ఠించి భూతసమితి
బరగ ధరియింపుచుండు నా బలమువలన
నమృతమయుఁ డైనయట్టిచంద్రముఁడనగుచు
నోషధుల కే నొనర్తుఁ బోషణంబు. 14

తే. గీ. నేనె వైశ్వానరుండనై నిఖిలమైన
భూతసంఘంబు మేనుల పొసఁగఁజొచ్చి
శౌర్యనిరతప్రాణాపానసహితవృత్తి
భక్ష్యభోజ్యంబు ......... నొనర్తు. 15

వ. మఱియు సకలప్రాణిహృదయములయందు నంతర్యామిత్వంబున వర్తించువాఁడ నేనె. నావలనఁ బ్రాణులకు స్మృతియు, జ్ఞానంబును సంభవిల్లు. నావలననె యాస్మృతిజ్ఞానంబులకు హాని సంభవింపదు. సర్వవేదంబులచేతను వేద్యుండ నేను, సర్వవేదాంతకుఁడను నేను, సమస్త సంప్రదాయంబులకు జ్ఞానంబు నుపదేశించు గురుఁడ నేనె, సర్వవేదార్థవేత్తను నేనె సుమ్ము. 16

తే. గీ. క్షరుఁడు నక్షరుఁడు ననుసంజ్ఞ లొందఫు
పురుషు లిరువురు జగమున భూరితేజ
క్షరుఁడు దేహంబు గా మదిఁ జర్చసేయు
మక్షరుఁడు జీవుఁడని చూడు మాత్మలోన. 17

తే. గీ. వీరలిరువురకంటెను వేఱయగుచుఁ
బరగు పరమాత్మ యనుపేరఁ బురుషుఁడొకఁడు
మూఁడులోకంబులును బొంది ముఖ్యవృత్తి
నంతయును బాలనము సేయు నతఁడె నేను. 18

తే. గీ. క్షరు నతిక్రమ మొనరింపఁ జాలువాఁడ
నక్షరునికంటె నుత్తముఁ డైనవాఁడ

గడఁగి లోకంబులందు నాగమములందు
నలరుచుందుఁ బురుషోత్తమాఖ్య నేను. 19

తే. గీ. ఎవ్వఁడేనియు మూఢత్వ మెల్లమాని
నన్నుఁ బురుషోత్తమునిగా మనంబులోన
నెఱుగునాతఁడు సర్వజ్ఞుఁ డిద్ధచరిత
సర్వకాలము నాసేవ సలుపు నతఁడు. 20

తే. గీ శ్రీకరంబుగ నాచేతఁ జెప్పఁబడిన
యిమ్మహాగోప్యశాస్త్రంబు నెవ్వఁడేని
తెలియఁగు నాతఁడు కృతకృత్యుఁ డెన్నఁదగిన
బుద్ధిమంతుఁడు జూ పాండుభూపతనయ. 21

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురుపరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురువరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆపస్తంబసూత్ర హరితసగోత్ర గాయమాంబాగర్భసంజాత నాగోజీపండితపుత్ర దత్తోజీపండిత ప్రణీతంబైన భగవద్గీతాశాస్త్రంబునందలి పంచదశాధ్యాయము.



శ్రీ ర స్తు.

# భ గ వ ద్గీ త.



## షోడశాధ్యాయము.



### దేవాసురసంపద్విభాగయోగము.

భగవంతుం డిట్లనియె.

దేవసంపదచేతఁ దేజరిల్లెడు యోగి
భయ మించుకయు లేక పరగుచుండు
చిత్తంబు సుప్రదాయత్తమై వర్తిల్లు
జ్ఞానయోగంబున భూనుతుండు
దానకర్మమునందుఁ దాత్పర్యశీలుండు
నిశ్శంకుఁ డింద్రియనిగ్రహమున
యజనక్రియలయందు నతులప్రమోదుండు
స్వాధ్యాయపదనభాస్వత్తనుండు
1. తపము నమమును మిక్కిలి ధన్యతరుఁడు
వక్రభావంబు నొందక వన్నెకెక్కి
సకలజనములు తనుజూచి సన్నుతింపఁ
బారుమశ్రీసమాశ్రయ పాండవేయ. 2

మఱియు సమ్మహానుభావునకుఁ బరపీడావర్జనంబును, సత్యంబును, క్రోధరహితత్వంబును, ఉపాదానత్వంబును, శాంతియు, పుణ్యరక్షుత్వంబును, పరులదోషంబు నిందించకుండుటయు, సల్లోలత్వంబును గలిగియుండును. 3

తేజము క్షమ ధృతి శౌచం
బాజముఖోదగ్రశౌర్య మడరుట గర్వ

త్యాజిత్వము సత్సంపద
తేజము గలమనుజునందుఁ దిరమగు సుమిస్మా. 4

క. అతిక్రూరము దర్పముదం
బితయును గ్రోధంబు పరుషభీకర వాచా
లతలును నజ్ఞానంబును
జతురతఁ బ్రాపించు నసురసంపత్తియుతున్. 5

తే. గీ. దేవసంపద మోక్షంబు తెరువు సూపు
నసురసంపద నరకంబు నందఁజేయు
దేవసంపదవాఁడవు నీవు పార్థ
సంశయింపఁగ వలదు విషాదముననూ. 6

క. దైవాసురగుణయుక్తుల
శ్రీవల్లభు డాదిసృష్టిచేసెం జుమిస్మా
దైవగుణవంతుఁ జెప్పితి
భావజ్ఞా దైత్యగుణుని బరగఁగ వినుమీ. 7

వ. మఱియు నసురసంపద గలవారికి ధర్మమునందుఁ బ్రవృత్తియు నధ
ర్మమునందు నివృత్తియు, శౌచంబును నాచారంబును, సత్యంబును
గలుగకుండును. 8

సీ. సకలప్రపంచ మసత్యముగాఁ జూచు
వేదశాస్త్రంబుల విశ్వసింప
డఖిలజగంబు ధర్మాధర్మసంప్రీతి
ప్రాశూన్య మదియుసి చర్చసేయు
నీలోకమున కెల్ల నీశ్వరుఁ డనఁగ లే
దెది యనీశ్వరమని మదిఁదలంచు
స్త్రీ పుంసమిథునమే సృష్టి కెల్లను కార
ణంబని మిగుల వాదంబు సలుపు

కాంతలకుఁ బురుషులకు మఱి కలుగునట్టి
కామవిభవంబె దీనికి కారణంబు
గాని మఱి కారణం బేమి గలుగదనును
దనుజసంపద గలిగిన మనుజుఁ డనఘ. 9

తే. గీ. ఇట్టియజ్ఞానదర్శన మొనగ నెందు
నల్పమతి యైనయట్టి దుష్టాత్ముఁ డుగ్ర
కర్మపారీణుఁడై జగత్క్షయముకొఱకు
ననఘ జన్మంబు నొందు దా నహితుఁ డగుచు. 10

వ. మఱియు నద్దురాత్ముండు శక్యంబుగాని కోరికల నాసించి డంభమాన
మదాన్వితుఁడై మోహంబున క్షుద్రదేవతల నారాధించి విశేషాదు
లం గోరుచు మద్యమాంసవిషయంబులగు నపవిత్రవ్రతంబుల నిరంత
రంబు నడపుచుఁ బ్రవర్తిల్లు.

తే. గీ. అపరిమిత మైన దుశ్చింత నాశ్రయించి
మరణమొందెడునందాక మసలుచుండు
కామభోగంబె పరమార్థగతి యటంచు
నిశ్చయం బొనరించి యానీచనరుఁడు. 12

క. మిక్కిలి యాశారజ్జులఁ
జిక్కి మిళత్కామరోషచేతస్కుండై
యెక్కుడు ధనములు గోరుచుఁ
దక్కను యన్యాయమునకె తనకోర్కులకై. 13

క. ఇదినాకు లబ్ధమైనది
యిదినాకు ప్రియంబు చాల యిదిగలుగుచునున్
నది యిది గాగలయది యని
గొదవక యేప్రొద్దు సొమ్ము గూర్పఁగడంగున్. 14

వ. మఱియు నతండు యిప్పు డొక శత్రుని వధియించితి నింకఁ గొందఱు శత్రువుల వధింపవలయు, ప్రభుండ నేనె, భోగిని నేనె కృతకృత్యుండ నేన సుఖినేన యనితలంచును. 15

తే. గీ. ఆఢ్యుడను నేనె కులవంతుఁడైనవాఁడ
నేనె నాకును లేరు సమాను లెచట
యజ్ఞ మొనరించు నర్థుల కర్థ మిత్తు
సంతసముగాంతు ననుచు యజ్ఞానుఁడగుచు. 16

తే. గీ. బహుళవిషయార్తచిత్తవిభ్రాంతుఁ డగుచు
మోహజాల సమావృత్తి మూఢుడగుచు
కామభోగ సమాసక్తికలితుఁడగుచు
నెసగువా డుగ్రనరకంబు లెపుడు జెందు. 17

వ. మఱియు నాదుష్టాత్మునకు తన్ను దానె పొగడుకొనుటయు ననిత్యంబగుధనంబుచేత నగుట గర్వాంధంబులు కలిగియుండుటయు సోమయాజి యనిపించుకొనుటయు డాంబికత్వంబుచేత నతిథిపూర్వకంబుగా యజ్ఞంబుచేయుటయుఁ గలిగియుండు. 18

తే. గీ. బలము క్రోధంబు దర్పంబు ప్రబలకామ
మును నహంకారమును గల్గి యనుదినంబు
తనకు నొరులకు నాత్మయై తనరు నాకు
ద్వేషియు నసూయతాసముద్వృత్తి నతఁడు. 19

తే. గీ. నాకు విద్వేషులైనట్టి నరులు పార్థ
వ్యాఘ్రసర్పాదియోనుల యందుఁ బుట్టఁ
జేయుదును సతతంబును శ్రుతిప్రసిద్ధి
నశుభకర్ములు క్రూరులు నగుటఁ జేసి. 20

తే. గీ. అసురము లగు యోనుల నమరబుట్టు
జనులు మూఢాత్ములై జన్మజన్మములను

నన్నుఁబొందఁగ లేక యాపన్నులగుచు
నధమగతిఁ బొందుచుందురు రఘుచరిత. 21

తే. గీ. కామమును క్రోధలోభముల్ గట్టిగాను
నరకద్వారము నాత్మకు నాశకంబు
గాన యీమూఁడుగుణములు గట్టువడక
సంచరింపఁగవలయును సజ్జనుండు. 22

వ. నరకద్వారంబు లగు నీ కామక్రోధలోభంబులు విడిచిన నరుండు మోక్షకరము లైన తపోయోగాదికర్మంబు లాచరించి పరమగతిఁ బొందును. 23

తే. గీ. ఎవ్వఁడేనియు శాస్త్రంబు నెడలఁ ద్రోచి
కామకభ్రాంతి వర్తించు కష్టనరుఁడు
జ్ఞానసుఖ మగుమోక్షంబు గానలేక
మహితసంసారజలరాశిమగ్నుఁ డగును. 24

తే. గీ. కాన శాస్త్రంబు ప్రామాణికముగ నెఱిఁగి
చేయవచ్చిన యవియును చేయరాని
యవియుఁ దెలియుచు శాస్త్రోక్త మైనయట్టి
కర్మములు జేయుచుండుము నిర్మలాత్మ. 25

ఇది సకలసుకవిజన సేవాపరాయణేత్యాది శ్రీరత్నోజీ పండిత
ప్రణీతంబయిన శ్రీభగవద్గీతా శాస్త్రార్థంబునందు
షోడశాధ్యాయము.



శ్రీరస్తు

# భగవద్గీత



## సప్తదశాధ్యాయము.



### —శ్రద్ధాత్రయవిభాగయోగము—

వ. అనిన విని యర్జునుం డిట్లనియె.

తే. గీ. శాస్త్రవిధిలంపటుఁడు గాక శ్రద్ధతోడ
నెవ్వఁ డేనియు యాజనంబు లెసఁగఁజేయు
నతనికయ్యది గతి తదీయంపుశ్రద్ధ
సాత్త్వికీ యోరాజసియో తామ సాశ్రితంబు. 2

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. 3

తే. గీ. శ్రద్ధ యనఘాత్మ త్రివిధమై చెలఁగుచుండు
పూర్వకర్మపుసంస్కారభూత మగుచు
ప్రథితమైనట్టి సాత్త్వికరాజసియును
తామసియు నన వివరింతు దాని నీకు. 4

వ. వినుము శ్రద్ధసత్త్వాదిగుణశ్రయై వివేకులకు నవివేకులకును గలిగి యుండు. పురుషుండు శ్రద్ధామయుఁడై పూర్వజన్మంబున నెవ్వఁడేని శ్రద్ధగలిగి వర్తిల్లువాఁ డుత్తరజన్మంబునందు నట్టి శ్రద్ధగలవాఁడై ప్రవర్తిల్లును. 5

ఉ. దేవచయంబు సాత్త్వికుఁడు దీపితభక్తి నుపాస్తి సేయు నో
దీనర యక్షరాక్షసతతిం దగఁ గొల్చును రాజసుండు లోఁ
గావర మొంది తామసుఁడు కష్టతరం బగు ప్రేతభూతసం
సేవలు సర్వకాలమును జేయుచునుండును గోర్కెతోడుతన్. 6

ఉ. కామము రాగమున్ బలము గల్గి యహంకృతిదంభయుక్తుఁడై
యేమనుజుండు శాస్త్రవిధి నంతయుఁ దుచ్ఛముగాఁ దలంపుచున్
భూమికి భీకరంబైన భూరితపం బొనరింపుచుండు నా
పామరు నాసురక్రియులఁ బల్కిన వానిగ నిశ్చయింపుమా. 7

తే. గీ. వాఁడు దుర్బలుఁడయి దేహవాసియైన
నను పృథివ్యాదిభూతములను గృశంబు
గాఁగ లంపట మొందించుఁ గాన వాని
ననఘ యసురుఁడని నిశ్చయముగ నెఱుఁగు. 8

క. ఆహార యజ్ఞతపములు
మోహిత్వవిదూర దానములు వివిధములై
దేహితతియందు వర్తిలు
నూహింపఁగ గుణవిభేద మొందినకతనన్. 9

వ. విను మాయుస్సత్త్వ బలారోగ్యసుఖప్రీతివివర్ధనంబులును రసవంతంబులును స్థిరంబులును హృద్యంబులు నగు చతుర్విధాహారములు సాత్త్వికంబులుగా నెఱుంగుము. 10

సీ. మిగుల చేదునకును మెచ్చుచు నుండును
భూరితీవ్రోష్ణము నొందు పులుసునకును
లవణంబు హెచ్చిన చవులు వేఁడుక జాల
నత్యుష్ణభోజనం బాదరించు
మిరియంబు మించిన మిక్కిలి ప్రియమందు
కోద్రవాన్నాదులు గోరుచుండు
బోరి నాసికాపుటంబులఁ బొగల్వెడలించు
నావపచ్ఛళ్ళకు నలరు నెపుడు

తే. గీ. మఱియు దుఃఖంబు శోకంబు మహితమైన
యామయంబును గల్పించునట్టి భక్ష

భోజ్య లేహ్య చోష్యంబు లింపుగ భుజించు,
పాండవేయ రజోగుణభాజనుండు. 11

ఉ. వండిన వెన్క ఝాము చన వర్ధితశైత్యకమైన యన్నమున్
ఖండితసారమైన యది గర్హితగంధములైన భక్ష్యముల్
మెండగు చల్ది యెంగిలియు మిక్కిలిదూష్యము లైనవస్తువుల్
పాండుజ తామసావళికి పాత్రములై చనుచుండు భుక్తికిన్. 12

తే. గీ. యజ్ఞకర్మంబు దనకుఁ గార్యంబటంచు
ఫలము లేమియుఁ గోరని ప్రాజ్ఞతముఁడు
విధియుతంబుగఁ జేయు నవ్విధు యజ్ఞ
మనఘ సాత్త్విక మనుపేర నలరుచుండు. 13

తే. గీ. ఫలము గాంక్షించు మిక్కిలి పరులచేత
నధికుఁ డనిపించుకొనఁ జాల నాస బొడమి
పురుషుఁ డొనరించు యజ్ఞంబు కురుకులీన
రాజసం బనుపేరిటఁ దేజరిల్లు. 14

తే. గీ. మంత్రములు దక్షిణములు సమగ్రముగను
విప్రులకు నన్నమిడుటయు వెలయ లేక
జనుఁడు బుద్ధివిహీనుఁడై సలుపునట్టి
యజ్ఞ మనఘాత్మ తామసం బనఁగ బరఁగు. 15

వ. వినుము దేవద్విజగురుప్రాజ్ఞపూజనంబును శౌచంబును నార్జవంబును
బ్రహ్మచర్యంబును నహింసయు కాయకత్వం బని చెప్పఁబడును. 16

తే. గీ. అభయదంబును సత్యంబు నభిహితంబు
నయమునను వాక్య మొగి వేదచయపఠనము
వాచకం బగుతపమున వరలుచుండు
పాండవోత్తమ తెలియుము ప్రజ్ఞచేత. 17

తే. గీ. భావశుద్ధియు నకఠోరభావమును మ
నఃప్రసాదంబు వినుతమౌనవ్రతంబు
విషయములవల్ల నింద్రియవితతి మగుడఁ
బట్టుటయు మానసంబునఁ బరగుతపము. 18

తే. గీ. ఫలమొకింతయుఁ గోరక పరమమైన
శ్రద్ధతోడను యోగులు సలుపునట్టి
త్రివిధమైనతపంబును దివిజరాజ
తనరు సాత్త్విక మనుపేరఁ దనరుచుండు. 19

తే. గీ. అన్యు లొనరించుపూజల కాసపడుచు
దంభమునఁ జేయు తపము వృత్రహతనూజ
రాజసం బనుపేరిటఁ దేజరిల్లు
నధ్రువంబును చలనంబు నగుచు మిగుల. 20

వ. మఱియు దుర్జనుండు దురాగ్రహమునఁ దనకు దుఃఖసంపాదన నా
కరంబును నొరులకు హింసాకరంబును గాఁగఁ జేయు నభిచారరూప
తపంబు తామసం బనఁ బరగుచుండు. 21

క. కాలము దేశము పాత్రము
జాలఁగఁ బరికించి విగతసంశయుఁ డగుచుఁ
మే లెంచియు నుపకారికి
తాలిమి నిడ సాత్త్వికాఖ్య దానం బయ్యెన్. 22

తే. గీ. అమరలోకసుఖంబుపై యాశనైన
కోర్కి ప్రత్యుపకారంబు గోరియైన
క్లేశమున నిచ్చుదానంబు కీర్తిధుర్య
రాజసం బనుపేర విభ్రాజితంబు. 23

తే. గీ. దుష్టకాలంబునందును దుష్టదేశ
మున నపాత్రులకిచ్చుట వినుతదేశ

కాల పాత్రంబు లొందవిన కడునవజ్ఞ
లడర నిచ్చుట తామస మనఁగఁ బరగు. 24

వ. వినుము గాయత్రీమంత్రంబునందుఁ బ్రణవాది నొక భాగంబు పరిత్యజించి మంత్రాత్మకమైన చతుర్వింశత్యక్షరంబులందుఁ బ్రణవాది వర్ణత్రయంబు పరబ్రహ్మనామనిర్దేశం బయ్యె నవియె బ్రాహ్మణులును యజనంబులును వేదంబులునై పూర్వంబునందె చేయఁబడెను 25

క. ప్రణవోచ్చారణపరులై
గణుతింపక యజ్ఞదానఘనతపములయం
దణుమాత్రముగ వికలత
గుణవంతా పొందనీదు క్షోణీధవులన్. 26

వ మఱియు నా ప్రణవంబుతరువాత రెండవవర్ణంబు నుచ్చరించి మోక్షకాంక్షులును ఫలత్యాగులు నైన మహాత్ములచేత వివిధంబులునైన యజ్ఞదానతపఃక్రియలు చేయంబడుచుండును. 27

తే. గీ. దాని డాసిన వర్ణంబు ధన్యచరిత
సాధుభావంబు నందును సత్యమునను
మాంగళికకర్మములయందు మహితముగను
సంప్రయోగింపఁబడు సూరి జనముచేత. 28

వ. మఱియు యజ్ఞతపోదానంబులందును ఆ వర్ణంబ చెప్పఁబడుచు. ఏతద్వర్ణత్రయనామకుం డగు శ్రీవాసుదేవుండె ఫలముగాఁ గలిగిన పూజోపహారములును, గృహాంగణపరిమార్జనోపలేపనరంగవల్లికాదులును, తత్సిద్ధికొఱకైన యుద్యానశాలిక్షేత్ర ధనార్జనాది తద్విషయ కర్మంబులును నాతృతీయవర్ణంబె యని చెప్పంబడును. తద్వర్ణత్రయాత్మకంబైన పరబ్రహ్మంబున్ గీర్తింప బ్రాహ్మణుండు సేయు సర్వకర్మంబులకు సాద్గుణ్యంబులు సంపాదిల్లును 29

తే. గీ. శ్రద్ధఁజేయని హోమంబు జపము తపము
దానమును మఱి యన్యసత్కర్మచయము
నిహపరంబులసౌఖ్యంబు లియ్య లేవు
శ్రద్ధతోఁ గాక యనఘాత్మ సత్క్రియలురు. 30

గద్య.

ఇది సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమద్వాసుదేవ ద్వాదశాక్షరీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేముగంటిపురనివాస ఆప
స్తంబసూత్ర హరితసగోత్ర గాయమాంబాగర్భసం
జాత నాగోజీపండితపుత్త్ర దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునందలి
సప్తదశాధ్యాయము.



శ్రీరస్తు.

# భగవద్గీత.

## అష్టాదశాధ్యాయము.

### మోక్షసన్న్యాసయోగము.

వ. అనిన విని యర్జునుం డిట్లనియె 1

క. సన్న్యాసత్యాగంబుల
ధన్యం బగుతత్త్వ మాత్మదగ నెఱిఁగింపుఁ డ
ద్విన్యస్తబుద్ధి నైతిని
మాన్యస్థితి నాకుఁ జెప్పుమా వార్ష్ణేయా. 2

వ. అనిన విని శ్రీభగవంతుం డిట్లనియె. వినుము శ్రీపుత్రదేహాది వస్తు
వులను బ్రహ్మచారి గృహవానప్రస్థంబులకు నియమించిన వేదోక్త
కర్మంబులను శిఖాయజ్ఞోపవీతంబులతోడఁ బరిత్యజించి పరివ్రాజ
కుండగుట సన్న్యాసం బని జ్ఞాను లెఱుంగుదు, దురాశ్రమత్వంబు వసి
యించి వేదోక్తకర్మంబులు గావించి ఫలంబుగోరక వాసుదేవా
ర్పణంబు సేయుట త్యాగం బని విచక్షణు లెఱుంగుదురు. 3

క. హింసాదికంబు లనుచుఁ బ్ర
శంసింపరు కర్మములను సాంఖ్యులు భువిలో
హింసాదికరము లైనఁ బ్ర
శంసింతురు బుధులు దాన సవనతపంబుల్. 4

ఆ. వె. త్యాగవిషయమున యథార్థంబుగా మత్ప్ర
భాషప్రసక్తి వినుము సంశయితను
మూఁడువిధములగుచు మొనసివర్తిలుఁ దద
త్యాగమహిమ వీతరాగహృదయ. 5

వ. మఱియు విజ్ఞానులు యజ్ఞదానతపఃకర్మంబులు పవిత్రంబులు గాన యవశ్యం బాచరింతురు. 6

క. కావున వేదోక్తంబులు
గావించుచు ఫలములందు గతసంగుండై
పావనుఁడై వర్తిల్లుట
ధీవర నా మతముగాఁగ దెలియుము మదిలోన్. 7

తే. గీ. అరయ గృహమేధి మోహంబు నధిగమించి
నిత్యకర్మంబు సేయక నిలిపెనేని
యట్టిత్యాగంబు తామసాహ్వయము నొంది
భూమిఁ బ్రఖ్యాతమగు సముద్భూరి చరిత. 8

క. కాయక్లేశభయంబున
నాయాసము నొందనోప నని కర్మంబుల్
సేయకవిడచిన త్యాగం
బాయతముఁగ రాజసాఖ్య మది ఫలమిడు నే. 9

తే. గీ. నిత్యకర్మంబులెల్లను నిర్వహించి
ఫలము సంగంబు గోరని భద్రమైన
త్యాగ మనఘాత్మ సాత్వికం బని ధరిత్రిఁ
బెంపును వహింపు శాత్రవభీమశౌర్య. 10

వ. వినుము సాత్వికత్యాగసంపన్నుఁ డగువాఁడు సుఖదుఃఖకరంబులైన నిత్యకర్మములందు స్నేహద్వేషంబులు వర్జించి స్థిరబుద్ధియు వైష్ణవ ధర్మపరుండైన నతఁడు భ్రష్టత్వంబు బొందఁడని విచ్ఛిన్నసంశయుఁ డునై వర్తిల్లును. 11

తే. గీ. దేహధారులు కర్మసందేహమెల్ల
సన్యసింప సమర్థులై చనరు పార్థ

కర్మముల్ చేసి ఫలసంగకాంక్ష వాసి
వారికి నర్పించుటయె త్యాగ మనుచుబుధులు. 12

తే. గీ. కర్మములుచేసి త్యాగంబు గానలేక
కడగు సత్వరజస్తమః కర్మపరులు
నాకమును మర్త్యలోకంబు నారకంబుఁ
జెందుదురు గాని సన్న్యాసి జెందఁ డనఘ 13

తే. గీ. కర్మసంసిద్ధులకు నెల్లఁ గారణంబు
నంచుఁ బ్రాధాన్యసంపద నతిశయిల్లు
సాంఖ్యవేదాంతముల సవిస్తరముగాఁగఁ
జెప్పఁబడినది చెప్పెద చెలఁగి వినుమి. 14

వ. అధిష్ఠానం బన దగు శరీరమును, కర్త యన దగు నహంకారమును, కరణంబనదఁగు చక్షుశ్శ్రోత్రాదికంబును, వివిధంబగు చేష్ట యనందగు ప్రాణాపానాదివ్యాపారంబును, దైవతంబనఁదగు సూర్యాదికంబును.

తే. గీ. వాఙ్మనోదేహములచేత పరతరంబు
కర్మములు సేయు నద్యోగకలితులకును
న్యాయమైనను విపరీతమైనఁ జేయఁ
గలుగఁగాఁ దగు నీయైదు కారణములు. 16

వ. కర్మకారణము లైదును గాఁదలంచు కర్తజీవుఁడు కార్యంబున హింస లుజేసియు నాత్మదృష్టిచేయనివాఁడును, హింసాఫలబద్ధుండును, దేహంబుగాకుండు ఆత్మను శరీరవ్యతిరిక్తంబు గాచుకతనను. 17

తే. గీ. తెలియఁదగినవి తెలియుట తెలివిగాను
కర్మసంతతి కుపదేశపరులు పార్థ
కరణమును కర్మమును గర్త కర్మసంగ్రి
హములకును నివె హేతువు లగుచునుండు. 18

తే. గీ. జ్ఞానమును కర్మమును గర్త సత్వముఖ్య
గుణవిభేదవశమున గణుతి కెక్కు
సాంఖ్యశాస్త్రంబునందును సమ్మతముగ
జెప్పఁబడినవి చెప్పెద చెలగి వినుము. 19

వ. మఱియు విభక్తంబులగు బ్రహ్మాది పిపీలికాది జంతువుల యందును,

తే. గీ. ప్రమదవిద్వేషమునఁ జాల రతుఁడుగాక
ఫలము సంగంబు నొల్లక పాఱఁద్రోచి
సరసుఁ డగువాని కర్మంబు సాత్వికంబు
గాఁ దలంపుము విజయ తత్క్రమముతోడ. 21

తే. గీ. కామకాంక్షలచేత నగాధమగుచుఁ
దగు నహంకారమున నైన దనువు చాల
దుఃఖమందఁగఁ జేయు నాతుచ్ఛకర్మ
మనఘ రాజస మనుపేర నమరుచుండు. 22

వ. మఱియు నాగామి శుభాశుభంబులును, ద్రవ్యక్షయంబును, పరపీ
డయు, స్వసామర్థ్యంబున నహంకారముచేత విచారింపక చేయునది
తామసకర్మంబు. 23

తే. గీ. ముక్తసంగుఁ డహంకారమోచనుండు
శృతిమహోత్సాహములయందు తెలివి కాఁచు
కర్మసిద్ధి యసిద్ధుల కలకపడఁడు
సత్వసంయుక్తుఁ డగుకర్త సజ్జనుండు. 24

వ. ఎంద సమత్వంబున నేమిట బ్రహ్మభావంబు నెట్లుజూడఁబడునట్టి
జ్ఞానంబు సాత్వికం బననొప్పును. 25

తే. గీ. సౌఖ్యదుఃఖబులందు నాసక్తు లనుచు
జీవజాలంబు దలపోయు భావమందు

రాజసజ్ఞాన మనుచును భూజనంబు
గణుతిసేయును సుజ్ఞాన జనవరేణ్య. 26

వ. పరబ్రహ్మంబు సముచ్చయంబులైన దేహంబులందును ప్రతిమాదు
లందు నెంచ లేదని తలపోయుటయుఁ బరమార్థపరిత్యాగంబును,
నల్పఫలకాంక్షిత్వంబును, గలుగుట తామసజ్ఞానంబు. నియతమగు
వానిని మిక్కిలి నెసగనీక తామసుండు. 27

తే. గీ. కర్మఫలకాంక్షియై రాగకలితుఁ డగుచు
నశుచి లుబ్ధత హింసయు నడకనుండు
హర్షశోకాన్వితుం డైన యట్టికర్త
రాజసుం డనుపేరఁ దాఁ దేజరిల్లు. 28

వ. మఱియు నానావిధజ్ఞానుండును, వివేకశూన్యుండును, నవినీతుం
డును, నత్యంతకుటిలుండును, పరావమానుండును, యలసుండును,
మందకర్ముండును, దుఃఖశీలుండును, నగు కర్త తామసుం డనఁగఁ
బరగుచుండు. 29

తే. గీ. బుద్ధియును ధైర్యమును గుణంబులవలనను
మూఁడుతెరగుల వర్తిల్లు మోహదూర
వేఱువేఱ ప్రపంచించి వెలయ నీకుఁ
జెప్పెదను విను చిత్తంబు చెదరనీక. 30

వ. మఱియు ధర్మంబునందు ప్రవృత్తి, యధర్మంబునందు నివృత్తి నిది
సేయఁదగు, నిది సేయఁదగనిది యది, యిది భయంబిది యభ
యంబు, బంధం బిది, మోక్షం బిది, యని యెఱుంగుబుద్ధి సాత్వికి
యనం బరగును. 31

క. ధర్మాధర్మవిచారము
నిర్మలకార్యం బకార్యనిచయము నెఱుఁగన్

వేర్మివహించని బుద్ధిని
ధర్మజ్ఞా రాజసి యని తలంతురు పెద్దల్. 32

తే గీ. నష్టధర్మంబు కేవలసిద్ధ మనుచు
సర్వకర్మము విపరీతసరణి జేయు
నట్టినష్టాత్మకుని బుద్ధి యహరహంబు
తామసి యనంగ భువిలోనం దనరుచుండు. 33

తే. గీ. ఎవ్వండేనియు ధృతిచేత నింద్రియుల
మానసప్రాణములం జాలమట్టుపఱచు
యోగమవ్యభిచారత నొనరు నెపుడు
నతనిధైర్యంబు సాత్వికం బనంగ బరంగు. 34

తే గీ. ధర్మకామార్థములు ఫలతత్పరతను
ధరణిం గావించు నాతని ధైర్య మనఘ
రాజసం బనుపేరిటం దేజరిల్లు
జగతిలో నియ్యదదియును సద్గతులను. 35

తే గీ. ధర్మకామభయంబుల నన్యవృత్తి
చేయ కాలస్య నిద్రాదిచింతం బొరలు
నట్టిపురుషుని ధైర్య మో యనఘచరిత
తామసం బనుపేరిటం దనరుచుండు. 36

వ. మఱియు సుఖంబుత్రివిధంబై వర్తిల్లు, నందు సాత్వికసుఖం బభ్యాసవశంబున దుఃఖాపహంబై వెలయు, వెండియు, సంతోషకరం బౌను. 37

తే. గీ. విషమువలె నుండు నభ్యాసవేళలందు
నభ్యసించిన వెనుకను యమృత మౌను
ఆత్మ బుద్ధి ప్రసాద జన్యంబు వినుము
సాత్వికాహ్వాయసౌఖ్యంబు సాధువర్య. 38

తే. గీ. మహితవిషయేంద్రియప్రసంగమంబు వలన
సమ్మృతసదృశత వర్తిల్లు నాదియందు
విషమువలె నుండు పరిణామ వేళలందు
నట్టిసౌఖ్యంబు రాజసం బనఁగఁబడును. 39

వ. మఱియు మొదల తుదను బంధంబయ్యును, ఆత్మకు మోహాకరం
బయ్యును, నిద్రాలస్యప్రమాదజన్యంబయ్యును, బరగు సుఖంబు
తామసతామసం బన బడుచుండును. 40

తే. గీ. ప్రకృతిజంబైన గుణముల పార్థ వినుమ
సమరులకు మానవావళి కలవిగాదు
త్రిగుణములఁ బాసినట్టియు దీవనత్వ
మనఘతర లేదు దివియందు నవనియందు. 41

తే. గీ విప్రులకు క్షత్రియులకును వైశ్యులకును
శూద్రులకు కర్మములు వేఱె చూపఁబడియె
ననఘ స్వాభావజన్యంబులైనయట్టి
విపులగుణముల చేత నీ విశ్వమునను. 42

వ. శమనంబును, బాహ్యేంద్రియనిగ్రహంబును వైష్ణవవ్రతంబుల
చేత శరీరంబు కృశంబు చేయుటయు, బాహ్యాభ్యంతర శౌచంబును
క్షమయు, నవక్రత్వంబును, శాస్త్రజ్ఞానంబును నారాయణావలో
కనంబును, నిస్సంశయముగ విష్ణులోకంబు గలదనుబుద్ధియు నివి
బ్రాహ్మణునకు స్వాభావిక కర్మంబులు. 43

తే. గీ. శౌర్య తేజః కుశలతలు ధైర్యగుణము
యుద్ధమున నోడి పాఱక యుండుటయును
దాన మిచ్చుట నియమన ధర్మపరత
క్షత్రియునకు స్వభావజ కర్మచయము. 44

తే. గీ. కృషియు గోరక్ష సద్ధర్మవిషయమైన
క్రియయు విక్రియమును నను కర్మవితతి
వైశ్యునకు సహజంబునై వసుధఁ దనరు
శూద్రకర్మంబు త్రైవర్ణ భద్రసేవ. 45

క. తమతమ కర్మంబులయెడ
భ్రమయక వర్తించి సిద్ధిబడయుదురు నరుల్
విమలతరసిద్ధి బొందెడి
క్రమమును దెలిపెదను నీకుఁ గౌరవముఖ్యా. 46

తే. గీ. ఏపురుషువల్ల భూతప్రవృత్తి దనరు
నెవ్వఁ డింతయు వ్యాపించి యెసఁగుచుండు
నతనిఁ దమతమ సత్కర్మవితతిచేతఁ
బూజచేసి నరుల్ సిద్ధి బొందుచుండ్రు. 47

వ. విను మర్జున భిక్షాన్నప్రాశనకరంబును, నహింసాపరంబును నగు బ్రాహ్మణకర్మంబుకంటె బహుధనధాన్యకంబైన నీగుణం బగుక్షత్రియ కర్మంబు నీకు శ్రేయస్కరంబు. అది యెట్లన్నను వర్ణాశ్రమపరులు వేదోక్తకర్మంబులు చేసి, కిల్బిషంబు నొందరు గావున. 48

తే. గీ. సహజకర్మంబు లనఘాత్మ సజ్జనులకు
విడువఁగారాదు దోషంబు దొడరియున్న
కర్మమెల్లను దోషసంకలిత మెపుడు
నగ్ని ధూమావృతస్థితి నలరునట్లు. 49

తే. గీ. సకలకర్మంబులందు నాసక్తి లేక
నిస్పృహుం డహంకారనిర్గతుండు
నైన పురుషుం డకర్మసన్యాసపరత
నెలయు నైష్కర్మ్యసిద్ధిచే విమలుఁడగుచు. 50

తే. గీ. అనఘ సన్న్యాససిద్ధిచే నలరుచుండు
బ్రహ్మ మొందెడుమార్గంబు పరగ నీకు
నెఱుఁగఁజెప్పెద సంక్షేప మెసఁగఁబార్థ
జ్ఞాననిష్ఠాపరత్వంబు మానుగాను. 51

తే. గీ. శుద్ధబుద్ధిని యోగసంసిద్ధి నొంది
ధైర్యమున దేహసంచారశౌర్య ముడిపి
యింద్రియంబుల కాంక్షల నెడలఁద్రోచి
రాగవిద్వేషముల నడురాగి గాక. 52

తే. గీ. విమలతరదేశములయందు వెలయ నిల్చి
నియతవాక్కాయచిత్తత నిర్వహించి
ధ్యానయోగంబు నభ్యాసతయును గల్గి
అధికవైరాగ్యమహిమ నుపాశ్రయించి. 53

వ. మఱియుఁ దా విరక్తుఁ డగుయోగి అహంకారంబును, దురాగ్రహం
బును కామంబును, క్రోధంబును, గృహాదిపరిగ్రహంబును, క్రూర
త్వంబును, మమకారంబును, విసర్జించి బ్రహ్మపదంబును బొందును.

తే. గీ. బ్రహ్మభూయంబు నొందు ప్రపన్నచిత్తుఁ
డనఘ శోకంబు కాంక్షయు నందకుండు
సకలభూతంబులందును సమత దాల్చు
నాదు మహనీయభక్తిచే నలరియుండు. 55

వ. మఱియు సర్వవ్యాపకుండును, సచ్చిదానందవిగ్రహునిగా నన్నుఁ
బరమభక్తిచేత నెఱింగి తదజ్ఞానపరిసమాప్తికాలంబున నతఁడు వచ్చి
నన్నె పొందును. 56

తే. గీ. నన్నె యాశ్రయనీయుగా నమ్మి మదిని
నిత్యనైమిత్తికంబులు నిర్వహించి
తనరువాఁతఁడు మత్ప్రసాదంబువలన
శాశ్వతంబగుపదమును సరగఁ జెందు. 57

తే. గీ. పార్థ కర్మఫలంబులఁ బరగ మదిని
నాకు నర్పణగావింపు మేకనిష్ఠఁ
బరగుచుండు నతండు మత్పరమచింత
బుద్ధియోగంబునను లెస్స పొందుపఱచు. 58

తే. గీ. నీదుచిత్తంబు నాయందుఁ బాదుకొనిన
పొసగు మత్కృప సంసృతిం బొలసిపోవు
మది నహంకారమును చెడి మామకోక్తి
వినకయుండిన భ్రష్టత్వ మనుగమించు. 59

తే. గీ. మన మహంకారమునఁ జాల మగ్నమయ్యు
యుద్ధమొనరింప ననుబుద్ధి నుండితేని
అన్యతంత్రుఁడ వగునిన్ను నడరి ప్రకృతి
యుద్ధ మొనరింపఁగాఁ జేయకుండు నెట్లు. 60

తే. గీ. క్షత్రకర్మనిబద్ధత చాల గలిగి
యుద్ధమొనరింప నను దుష్టబుద్ధినుండి
యయిన నిజకర్మ పరతంత్రుఁ డైననిన్ను
కర్మములు తోడుకొనివచ్చు కయ్యమునకు. 61

వ. విను మర్జున శ్రీవాసుదేవబ్రహ్మంబు సకలభూతహృదయస్థాన
ముల నిలచి తనమాయచే నటకుండు బొమ్మలనాడించు చందంబున
జగంబును నటింపఁజేయుచుండును. 6

తే. గీ. సర్వభావన నతనినే శరణువొందు
తత్ప్రసాదంబువలననే ధర్మచరిత
శాశ్వతంబయ్యుఁ బరమమౌ శాంతి గలుగు
వైష్ణవస్థానమందెద విక్రమముగ. 63

వ. వినుము పార్థ యశేషజ్ఞానసంపన్నంబయ్యును, సకలశాస్త్రరాజం
బయ్యును, గోప్యంబునకు గోప్యంబయ్యును బరగు నింకొకటి గలదు.

గీతాశాస్త్రంబునే నీకుఁజెప్పితి; నంతయు విమర్శించి యథోచితం
బాచరింపు మంతకోపవేని. 64

క. ఇదిగాక గోప్య మొక్కటి
సదయా కడమాట వినుము సంశయపడకన్
పదిలముగ వినుము చెప్పెద
సదమలమతి నాకు నిష్టసఖుఁడవు యగుటన్. 65

తే. గీ. మన్మనస్కుఁడ వగుము మద్భక్తి గలిగి
నన్నె పూజించు మఱిమఱి నాకె మ్రొక్కు
మస్మదీయపదమునందు నలరుచుండు
పరమసఖుఁడవు ప్రీతి నాపలుకు వినుము. 66

వ. సావధానుండవై నమ్మి విను మర్జున భవదీయకులాశ్రిమోచితసక
లధర్మంబులు పరిత్యజించి, నిర్భరుండవై యన్యదేవతాభజనంబు
మాని నన్నొక్కనినే శరణుపొందుము; మే నిన్ను సర్వపాపంబుల
వలన విముక్తునిం జేసెద, శోకింపకుము, విష్ణుభక్తుండై హృదయము
నందు, ధ్యానయుక్తి నఖండదర్శనం బను నారాయణావలోకనంబుగ
చేయు యోగీశ్వరునకు, జ్ఞానంబువలన జ్ఞానంబువలననైన కర్మపతి
త్యాగంబుచేసిన దోషంబు లేదు, లేదు, రక్షింతు, రక్షింతు, నిదియె
నాపరమప్రతిజ్ఞ, యింతకంటె మీఁద యిఁక లేదు, వినుమని యిమ్మ
హాశాస్త్ర ముపదేశ మియ్యగలదు, భక్తరహితులయిన కర్మవిపా
కులకును, నన్ను దూషించువానికి నాకు గర్వమునను, శుశ్రూష
చేయని మూఢునకును. 67

తే. గీ. ఇమ్మహాశాస్త్రగోప్యత యెఱిఁగి భువిని
తెలిసి మద్భక్తునకు నుపదేశ మిచ్చు
వానికంటె ప్రియుఁడు నాకు వర్తమాన
భావికాలంబులందును పరగ లేఁడు. 68

తే గీ॰ మనలసంవాదమైన యీమహితశాస్త్ర
మనుదినంబును పఠియించు ననఘుతముఁడు
మానసంబున భక్తిని బూని కొల్చి
మత్ప్రసాదంబు గాంచి సమ్మదము నొందు. 69

తే. గీ. మఱియు శ్రద్ధానసూయుల మహితుఁడగుచు
దీని వినినను వ్రాసిన మానితుఁడును
విష్ణుభక్తులు జెందెడి విమలపదము
ప్రకృతివలన విముక్తుఁడై పరగు పార్థ. 70

తే. గీ. ఇమ్మహాగోప్య మగుశాస్త్ర మింతవఱకు
అనఘ యేకాగ్రచిత్తుఁడ వగుచువింటి
దీనసజ్ఞాన జన్మమై తేజరిల్లు
మోహ మెడలిన చెపుము సందేహపడక. 71

వ॰ అనిన విని యర్జునుం డిట్లనియె. 72

తే. గీ. నీప్రసాదంబువలన నో నీరజాక్ష
మన్మనోవీధి సందేహ మంత దొలఁగె
మోహ మెడలెను సుజ్ఞానపూర్తిఁ జెందె
శిరమునను దాల్తు మీయాజ్ఞ సిద్ధముగను. 73

వ. అనుచుఁ బలికిన శ్రీకృష్ణార్జునసంవాదంబు, సంజయుఁడు ధృతరా
ష్ట్రున కెఱిఁగించి యిట్లనియె. 74

తే॰ గీ. అఖిలలోకములందు పూజార్హులైన
వాసుదేవార్జునుల సంవాద మేను
వినఁగఁ గంటిని ధృతరాష్ట్రవిభువతంస
అద్భుతము రోమహర్షంబు నావహిల్ల. 75

వ॰ పరమేశ్వరుం డగుశ్రీకృష్ణదేవుండు ప్రత్యక్షసాక్షాత్కారంబునంది
చెప్పిన యిప్పరమయోగశాస్త్రరాజరహస్యంబున నున్న పరమ
రహస్యంబు శ్రీవేదవ్యాసకృపాప్రసాదంబువలన. 76

తే. గీ. వెలయు కృష్ణార్జునులచేత విదితమగుచు
పుణ్యమును నద్భుతమునను భూరిశాస్త్ర
మనఘ తలపోసి తలపోసి యాత్మలోన
నున్నతామోదభర మెుందుచున్నవాఁడ. 77

తే. గీ. అర్జునుం డనిలోన యాయబ్జనాభు
విశ్వరూపంబు తలపోసి విస్మయమున
రోమహర్షంబు నొందెను బ్రేమతోడ
రాజితైశ్వర్యధృత రాష్ట్రరాజవర్య. 78

ఉ ఎక్కడనుండు యోగివిభుఁ డీశ్వరుఁ డాకమలాసనుండు నుం
కెక్కడ ధన్వియై చెలగు సిద్ధచరిత్రుఁడు పార్థుఁడెన్నఁగా
నక్కడ లక్ష్మియున్ జయము నద్భుతసంపదకీర్తియున్ గడు
న్వొక్కసమై వసించు పృథివీవర నిశ్చయ మెంతయేనియున్. 79

గద్య.

ఇది. సకలసుకవిజనసేవాపరాయణ శ్రీమ ద్వాసుదేవ ద్వాదశాక్షరీ
మంత్రరాజప్రసాదసిద్ధ యోగవిద్యావిశారద శ్రీనారదాది గురు
పరంపరావాప్త శ్రీవిష్ణుస్వామి సంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్య
గురుకులతిలక యోగీంద్ర చూడామణి శ్రీనరసింహదేవ గురు
వరేణ్య శ్రీపాదపద్మారాధక వేనుగంటిపురనివాస ఆప
స్తంబసూత్ర హారితసగోత్ర గాయమాంబాగర్భసం
జాత నాగోజీపండితపుత్ర దత్తోజీపండిత ప్రణీతం
బైన భగవద్గీతాశాస్త్రంబునం
దష్టదశాధ్యాయము.

సంపూర్ణము.



# నాటకములు

| | | |
|---|---|---|
| రాపాఖ్యానం చి॥ ల॥ | 0 | 8 |
| సన్న యాదవము | 0 | 8 |
| జాతాపహరణం | 0 | 8 |
| క్వతీపరిణయం | 0 | 6 |
| ప్న వాసవదత్త | 0 | 6 |
| —అనసూయ అ॥ సో॥ | 0 | 12 |
| ామణి | 1 | 0 |
| హ్లాద | 1 | 0 |
| త్రిచిత్రమాల | 0 | 12 |
| దామనోహారం | 0 | 12 |
| నంద కొ॥ స॥ రా॥ | 0 | 12 |
| దావిజయము | 0 | 12 |
| ర్ణ రామాయణం | 1 | 4 |
| కభీరు | 1 | 0 |
| సీదాసు | 1 | 0 |
| ర్ణఆంజనేయం | 1 | 0 |
| మరందము పె॥ వెం॥ | 0 | 4 |
| ర్ణభారతము సం॥ శిం॥ | 1 | 4 |
| లీల సాంగ్సుగలవు | 1 | 0 |
| ర్ణోత్తరరామాయణం | 1 | 4 |
| డవజననము రా॥ నా॥ క॥ | 0 | 12 |
| డవోద్యోగం | 0 | 12 |
| డవప్రవాసం | 0 | 12 |
| డవఅశ్వమేధం | 0 | 12 |
| పాత్రి | 1 | 0 |
| వవిజయం | 1 | 0 |
| సి | 1 | 0 |
| ల్యాశాపవిమోచనం | 0 | 12 |
| వపట్టాభిషేకం | 0 | 12 |
| రిశ్చంద్రి | 0 | 12 |
| మజననం ద్రో॥ సీ॥ రా॥ | 0 | 8 |
| మవుద్యోగం | 0 | 8 |
| మప్రవాసం | 0 | 8 |
| శ్రీరామఅశ్వమేధం | 0 | 8 |
| శ్రీరామవిజయం | 0 | 8 |
| ఆంధ్రపతాకం | 1 | 0 |
| ద్రౌపదీవస్త్రాపహరణం | 0 | 12 |
| ద్రౌపదీపరిణయం | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారం | 0 | 12 |
| లంకాదహనం | 0 | 10 |
| పాండవాజ్ఞాతవాసం | 0 | 10 |
| వేశ్యాహితబోధిని | 1 | 0 |
| వేశ్యామధురం 1 వ భాగం | 1 | 0 |
| వేశ్యామధురం 2 వ భాగం | 1 | 0 |
| వేశ్యామధురం 3 వ భాగం | 0 | 8 |
| సంగీతశశిరేఖ | 0 | 12 |
| సారంగధర | 0 | 12 |
| ఉషాపరిణయం | 0 | 8 |
| పాదుకాపట్టాభిషేకం | 0 | 12 |
| పీష్వానారాయణరావు | 0 | 10 |
| లోకాభిరామాయణం | 0 | 6 |
| రామాయణసారం | 0 | 12 |
| శ్రీనివాసకళ్యాణం | 0 | 8 |
| జారవిలాపం | 0 | 12 |
| చతురచంద్రహాస | 0 | 8 |
| విచిత్రబిల్హణీయం ఉ॥ అ॥ | 0 | 8 |
| మణిమాల | 0 | 12 |
| దుర్గావతి దం॥ కి॥ స్వా॥ | 1 | 0 |
| దానవీరకర్ణ సో॥ రా॥ | 1 | 0 |
| శ్రీరామపట్టాభిషేకం జ॥ ల॥ | 1 | 0 |
| సత్యాబాయి | 0 | 12 |
| సురసుద్దాల | 0 | 8 |
| విజయభాస్కరనాటకం | 1 | 0 |
| హనుమద్రామసంగ్రామం బ॥ కో॥ | 0 | 12 |
| సుమతీదేవి | 0 | 12 |
| సంపూర్ణభాగవతము | 0 | 12 |

సూరి సుబ్బారావు, బుక్ సెల్లరు, భీమడోలు, పశ్చిమగోదావరిజి॥

| | | |
|---|---|---|
| మాతృదాస్యవిమోచనం అను గరుత్మంతునిచరిత్రి బు॥ సు॥ | 0 | 12 |
| రామరాజు శే॥ రా॥ శా॥ ఫాలాఫ్‌విజయనగర్ | 0 | 12 |
| సత్యహరిశ్చంద్రీయం బు॥ లు॥ | 1 | 4 |
| సాత్రాజితీయము | 1 | 0 |
| బుద్ధిమతీవిలాసం | 1 | 0 |
| ఉత్తరరాఘవం | 1 | 4 |
| ప్రతాపరుద్రీయం వే॥ వెం॥ | 1 | 4 |
| కన్యాశుల్కం గు॥ అ॥ | 1 | 0 |
| రోషనార కో॥ సు॥ | 1 | 0 |
| పాండవప్రతిజ్ఞ అ॥ సుం॥ | 0 | 12 |
| యాదవులప్రతిజ్ఞ | 0 | 12 |
| ఊర్వశీశాపవిమోచనం | 1 | 0 |
| జయచంద్రచంద్రరేఖావిజయం | 0 | 12 |
| గర్వభంగం | 0 | 10 |
| భక్తతుకారాము త్యా॥ వెం॥ | 1 | 0 |
| వరవిక్రయము నా॥ సు॥ | 1 | 0 |
| శ్రీరామవిజయం శ్రో॥ వా॥ | 0 | 10 |
| సీతామనోహరం కా॥ వీ॥ | 0 | 8 |
| బొబ్బిలియుద్ధం శ్రీ॥ కృ॥ | 1 | 0 |
| సంగీతసావిత్రి గ॥ కా॥ | 0 | 12 |
| జయంతజయపాలీయం | 0 | 12 |
| విష్ణులీలలు చ॥ మా॥ | 0 | 12 |
| పద్మవ్యూహము | 1 | 0 |
| శ్రీకృష్ణరాయబారము | 0 | 12 |
| శ్రీకృష్ణరాయవిజయం | 1 | 0 |
| సంగీతచంద్రకాంత | 0 | 10 |
| మహారాష్ట్రవిజయం | 0 | 10 |
| సంగీతస్త్రీసాహసం | 0 | 12 |
| సంగీత గులోబకావళి | 1 | 0 |
| భక్తరామదాసు కే॥ శి॥ శా॥ | 1 | 0 |
| పాంచాలీమానసంరక్షణం కే॥ రా॥ | 1 | 4 |
| సీతాకళ్యాణం బు॥ శి॥ | 0 | 8 |

| | | |
|---|---|---|
| రుక్మిణీకళ్యాణం జి॥ జా॥ | 1 | 0 |
| శ్రీకృష్ణవిలాసం అ॥ సం॥ | 0 | 12 |
| పసన్‌బకావళీ | 0 | 12 |
| కనకతార వి॥ చం॥ శే॥ | 0 | 12 |
| రసపుత్రవిజయం అ॥ శే॥ రా॥ | 0 | 10 |
| మోహినీరుక్మాంగద | 0 | 12 |
| భీష్మప్రతిజ్ఞ | 0 | 12 |
| మహేంద్రజననం | 0 | 12 |
| సీతావిజయం పు॥ వెం॥ | 0 | 12 |
| లవకుశ నా॥ సు॥ | 1 | 0 |
| చిత్రనళీయం చ॥ మా॥ | 1 | 4 |
| భూలోకరంభ | 1 | 0 |
| కనకార చం॥ కే॥ | 1 | 4 |
| శ్రీరామనిర్యాణం బ్రా॥ శి॥ | 0 | 8 |
| బుద్ధనాటకం | 0 | 8 |
| కీచకవధ ని॥ కృ॥ | 0 | 10 |
| సంగీతజగన్మోహిని పా॥ బు॥ | 1 | 0 |
| సంగీతపద్మిని | 0 | 10 |
| విలువిద్య య॥ కృ॥ | 0 | 3 |
| చాటుపద్యశ్రవణానందం | 0 | 3 |
| వేణీసంహారం వ॥ సు॥ | 1 | 0 |
| అభిజ్ఞానశాకుంతల | 1 | 0 |
| విక్రమోర్వశీయం | 0 | 8 |
| చండకౌశిక | 0 | 10 |
| భక్తచింతామణి | 0 | 5 |
| సతీస్మృతి | 0 | 4 |
| కంఠాభరణం పా॥ ల॥ న॥ | 1 | 0 |
| రాధాకృష్ణ | 0 | 10 |
| పాదుకాపట్టాభిషేకం | 1 | 4 |
| సుగుణమణి వ॥ బా॥ | 0 | 10 |
| కన్యకాపరమేశ్వరివిలాసం | 1 | 0 |
| రంగరాయకదనసమవాకారం | 1 | 0 |
| హాస్యపుపాటలు వ॥ జ॥ | 0 | 8 |
| వేడుకపెండ్లిపాటలు తె॥ లి॥ | 0 | 10 |

# రజపుత్రవిజయము.

(గ్రంథకర్త — శ్రీ ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు.)

ఏరజపుత్ర వీరజ్యోతి హైందవ సామ్రాజ్య లక్ష్మీధురంధరుఁడగు నాలంఘీరుబాదుషా నుర్రూతలూగించెనో, ఏప్రచండవీరావతారము రాజకీయరంగమున నవనవాదర్శములం బ్రదర్శించెనో, ఏవీరసింహనాదము క్షాత్రవగజములకు సింహస్వప్నమో యామేవాడ పార్థివుఁడగు రాజసింహుని దివ్యచరిత్ర. ఠాకూర్ దుర్గాదా సీనాటకమున సన్న్యాసివేషమున స్వాతంత్ర్యసంపాదనము సలిపెను. వీరమాత మహావీరమాతయై విలసిల్లినది ; విమలమానసయగు విమల — ఏ నారీలలామము జన్మమున, రూపనగరాధీశ్వరుని గర్భవారాశితోపాటు భారతేందిరాలలామము ధన్యశాలయ్యెనో — యా కళ్యాణగుణవతి, శ్రీరాజసింహవీరుల పాణిగ్రహణాధీనమనస్కయై కావించిన యమానుషకృత్యములు — వీరవిహారములు — పడినకష్టములు చదివితీరవలయును ; విమలసోదరియగు ధర్మచ్యుత కేసరిబీగం, ఆలంఘీరు బాద్షాను పెండ్లియాడి విమలతోఁ బ్రతినబూని యామెను తురకకిచ్చి పెండ్లిచేయ యత్నించి తుదకు తానే రజపుత్రుల చేతులలోఁ బడుట, ఔరంగజేబు సేన లాహారపానీయములు లేక గుహలోఁ జిక్కువడుట, దుర్గాదాసు ప్రచ్ఛన్నవేషమున, రూపనగర భైరవాలయమున చెప్పిన జ్యోతిషమున శృంగార రసోదయ మగుచున్నది. విమల విసరినపూలగుత్తి మన్మథుని ఫిరంగిగుండై రాజసింహుని వక్షమునం దగులుట, చదువరుల నానందసాంబుధిని నోలలాడించును. గులాము చంద్రభోగల హాస్యము, తురక పెండ్లికొడుకు వెఱ్ఱిసరసము, గులాము చమత్కారము బాలుఁడగు అజితసింహుని శూరత్వము అద్భుతసమన్వితములు. వింతలోవింత-విమలను గాపాడుటకై మగవేషముతో వచ్చిన, వీరమాతను గాంచి విమల రాజసింహునిగా నెంచి శృంగారసంభాషణము చేయుట, ఆసమయమునకే వచ్చిన రాజసింహుఁడు వీరమాతను పరపురుషునిగ భ్రమించి యాగ్రహపడుట మిగుల చమత్కారరంగము. ఆలంఘీరు కాశీవిశ్వేశ్వరాలయవిధ్వంసము చేయుట, హిందువులమానసములం గలచి గగుర్పాటు గలిగించుట- వేయేల- దేశభక్తిపూరితము. పద్యములొక్కొక్కటి లక్షరూపాయల విలువగలది. ఆంధ్రదేశ రంగస్థలములందంతను వీరతాండవము సల్పిన మహాచారిత్రక నాటకము. ఔరంగజేబు పరిపాలనమంతయు నిందున్నది. చదివిచూడుడు. నవరసములు వర్షించు నాటకము. ఇప్పుడిట్టి నాటకరాజమే తెలుగున రచింపఁబడుటలేదు.

వెల 1—0—0.

వలయువారు — కురుకూరి సుబ్బారావు,

బుక్కుసెల్లర్, భీమఁడోలు,

కృష్ణాజిల్లా అని వ్రాయవలెను.

ఆలీబాబా అను

# అదృష్టవిజయము

[శ్రీయుత సోమరాజు రామానుజరావుగారు.]

"అన్యాయార్జితమగు ధనము నారికేళమందలి జలమువలె హరించిపోవు"ననుటకీయాలీబాబా కథప్రమాణము. అదృష్టము రెక్కలు విప్పుకొని యెగురుచున్నది. అది యిచ్ఛామాత్రమున వ్రాలును వ్రాలినచోట లక్ష్మి తాండవించుచున్నది; దరిద్రుడగు నదృష్టగుప్తునిపై నదృష్టదేవి తన పక్షచ్ఛాయం బఱపుచున్నది. అనంత ధనసంచయములను మహారణ్యములందు కూర్చియుంచిన, మైరావణ మహాచోరుని యదృష్టము తారుమారైనది; రక్షితమగు మహావిప్లవము పాతాళగుహయందు బయలుదేరినది. "జయత్రిలోత్తమా" యనుటతోడనే, గుహాతలము పటాలున బ్రద్దలగుచున్నది. అందలి రత్నరాసులకు కన్నులు దిగ్భ్రాంతములైపోయిన లోభగుప్తుని మృత్యుదేవి వరించినది; చోరులచే నాతని శవఖండములు గుహాకుం గట్టంబడినవి. కథాప్రవాహమున రక్తధారలంతర్వాహినులై పాఱుచున్న వేళల చదువరుల గుండెలు ముందేమగునో యని కొట్టుకొను వేళ— "చతుర" యను చతురవ్యక్తిరంగమున దృశ్యమైనది; మొగమునమందహాసము-ఒడిలో చంద్రహాసము; బహిర్గతమున నతిసుప్రశాంతివేషము-అంతర్గతమున శాత్రవప్రతీకారరోషము—ఇట్టిబహిరంతర్విరోధభావములతో నీపాత్ర తీవ్రస్వరూపము దాల్చి, యదృష్టగుప్త రక్షణమునకై పనిచేయసాగినది! చతుర భీకర కాలాంధకార మధ్యమునం గటారిచేంబూని 40 నూనెబుంగలలో దాగిన దొంగలను భంగపరచినది. ఆశాభంగమైన మైరావణుండు చతురం గని భయకంపితుండై పలాయన మంత్రముంబునశ్చరణ చేసినాండు—దిక్కుమాలిన గుహాంగనని, మైరావణుండొనర్చిన రోదనమునకు దిశాతలములు భేదిల్లినవి తుదసారి ఘూర్ణితమనోహంకారములతోడ, నాయపస్మైరావణవ్యక్తి హత్యారంగమున మునివేషముతోం బ్రవేశించి, కాలసర్పమువలె నదృష్టగుప్తునింటం దూరెను. చతురవాని యాగడ నెఱింగినది. శాత్రవహృదయ విభేదనశీలయగు నా నారీరూపభైరవి, నాట్యమందిరముం బ్రవేశించినది. నటనమున కపటము—నృత్యమున హత్య-మథనమున రుధిరము-పాపము బ్రద్దలయ్యెను. బహుదినములనుండి [illegible]గహతమైనాండు. సర్కారువారు శ్రీమతి చతురాదేవియని యామెకు బిరుదు నిచ్చుటతో-చతురాదృష్టగుప్తుల కరములయందలి పూలదండ లన్యోన్య కంఠాశ్లేష మొనర్చుటతో—సకలజనానందముతో-కరటకదమనకుల హాస్యములతో, రేముక్కపగటి చుక్కల యుక్తిప్రయుక్తులతో, కథామంగళరంగము పరిసమాప్తమగుచున్నది. ఎచ్చటం జూచిన రసముప్పతిల్లుచుండును. అనేకసారులు ప్రదర్శింపంబడినది. స్వరములతోనున్న పాటలు ప్రయోగ సౌలభ్యముగల నాటకరాజము. త్వరపడుండు. వెల 0—12—0.

---

వలయువారు—కారుకూరి సుబ్బారావు, బుక్కుసెల్లర్ భీమడోలు.

